శ్రీరస్తు

# వసంతసేన

ఆంగ్లసంస్కృతకావ్యలక్షణవిలక్షిత మగు

స్వాతంత్ర్యపద్యకావ్యము

## కొల్లకూరి గోపాలరాయప్రణీతము

"సత్యము, ధర్మమోక్షముల సంగతికిన్ దగి యర్థకామముల్
నిత్యసుఖంబుఁ గూర్చు నవలీల జనంబులకున్ బవిత్రదాం
పత్యము కారణంబుగఁ; బ్రమాణమతిన్ గృతి కట్టి శుద్ధదాం
పత్యముఁ బ్రోషితప్రియసమాగమమున్ గథగా గ్రహించితిన్."

ప్రకాశకులు: విశల్యా డిపోవారు

4, ఆచారప్పన్ సందు, జార్జిటవున్, మదరాసు - 1925

# INTRODUCTION

I FEEL happy to introduce to the notice of the Telugu Scholars an interesting little poem of Mr. K. Gopaul Rau, a rising brother of theirs. It belongs to that class of poetry which is headed in Sanskrit by Kalidasa's *Meghaduta* (Cloud Messenger).

It is an advantage to Telugu Literature that the present day Telugu poets are appreciating and adapting the beauties of English poems. Mr. Gopaul Rau's **Vasantasena** can be cited as an instance. Goldsmith's charming ballad, " The Hermit", has given the ground work to **Vasantasena**. The author has made several alterations in the simple plot so as to harmonise it with Indian life and oriental taste. The poem affords agreeable reading, as it is characterised in due proportion by emotion, fancy and moral elevation. It is teeming with many brilliant and wise sayings, the best of them being Mr. Gopaul Rau's own. Though the poem is a small one, it gives plenty of healthy exercise to the intellect. It glows on also as a string of interesting puzzles easily solved.

The conventions of Telugu Poetry have been observed. The donouement is delightful. The style is happy, evincing the characteristics of Dandin and Bharavi. The figurative language is impressive and suggestive. I recommend the poem to youngsters for study.

**V. Venkataraya Sastry**

(Retired Sanskrit Pundit and

Superintendent of Vernacular Studies,

Madras Christian College.)

# ఉపోద్ఘాతము

(ఆంగ్లమున కనువాదము)

ఆంధ్రపండితులలో నొకరుగా వర్ధిల్లుచున్న కొల్లకూరి గోపాలరావు గారి మనోజ్ఞమైన యొక చిన్న కావ్యమును ఆంధ్రపండితుల యెఱుకకు తెచ్చుటకు నా కాహ్లాద మగుచున్నది. అది సంస్కృతమునందలి కాళిదాసుని 'మేఘదూత' వంటి కావ్యముల తరగతిలో చేరినది.

ఈ కాలపు తెలుఁగు కవులు ఆంగ్ల కావ్యములందలి సారస్యమును చక్కఁగ పరిగణించి తత్తమకృతులం దలవరించుకొనుచుండుట ఆంధ్రవాఙ్మయమున కొక లాభము. గోపాలరావు గారి 'వసంత సేన' నిందున కొక నిదర్శనముగ చూపవచ్చును. గోల్డుస్మిత్తుయొక్క 'హెర్మి' ట్టనెడి యింపైన చిన్న గీతమాలిక 'వసంతసేన' యితివృత్తమునకు భూమిక. గ్రంథకర్త యిందలి కథాప్రబంధమందు హైందవుల జీవితచర్యకును ప్రాచ్యుల యభిరుచికిని అనుగుణముగా పెక్కు మార్పులఁ జేసియున్నాఁడు. ఈ కావ్యము పరిమిత మగు భావపుష్టిచేతను ఊహాచాతురిచేతను నైతికాభ్యున్నతిచేతను చదువుటకు మిక్కిలి యింపుగా నున్నది. మంచివాక్యములను ప్రజ్ఞ యుఁగల పెక్కు సూక్తులిందు నిండియున్నవి; వానిలో మేలైనవి గోపాలరావుగారు సొంతముగా రచియించినవే. కావ్యము చిన్నదైనను, బుద్ధికి మంచి పరిశ్రమను సమృద్ధిగ నొడగూర్చుచున్నది; మఱియు, చిత్రములై సులభముగా విడఁదీయఁదగిన గూఢబంధముల సరమువలె మఱిమఱి మెఱయుచున్నది.

ఆంధ్రకవిత్వసమయము లిందు పాటింపఁబడినవి. వస్తుభూమిక యుల్లాసజనకముగ నున్నది. దండిభారవుల కవితాలక్షణములు గలిగి, శైలి యింపు నింపుచున్నది. అలంకారములు రసోద్దీపకములుగాను ధ్వనిప్రచురములుగాను నున్నవి. ఈ కావ్యము యువజనులకు పఠనయోగ్య మని నిర్దేశించుచున్నాఁడను.

వేదము వేంకటరాయశాస్త్రి

శ్రీరస్తు

# వసంతసేన

## కావ్యప్రశంస

అర్థము సొంపును భావముల చమత్కృతియు రసముల పుష్టియును సందర్భముల శుద్ధియుఁ గవితాపేటికయందలి ముఖ్యభూషణములు. ఇవి కవితారంగమునం దాయా పాత్రములకు నలవరించునవైన పథ్యరచనలు. ఈ చిన్నెలు వన్నెలు గొని, కవి సామాన్యమగు నొక వస్తువును గవితాఫలకమున దిద్ది ముద్దుగులుకు నొక చిత్రము చేయుచున్నాఁడు. శకుంతలకు వ్యాసులకంటెఁ గాళిదాసు మిక్కిలి మెఱుఁగులు గూర్చెను. ఉత్తర రామాయణమునకంటె నుత్తరరామచరితమందు సీత మఱింత కన్నె రొలికించుచున్నది. కవిత పెట్టినదే సొమ్ము; అది పుట్టించినదే రసము. కవి పట్టిన దెల్ల బంగారమే కదా!

చమత్కారము కవిత్వమున కొక స్వరూపధర్మము. అది కవిత్వపు మోహనశక్తి. ఆ శక్తి నెరపుటకై యది తనంతటఁ గల్పించుకొను సరి కోశము వేఱు; పరిభాష వేఱు; వ్యవహారము వేఱు. అది 'తియ్యని' పలుకులను 'తేనె లుట్టిపడు' ననును. 'తెల్లని' నవ్వులను 'వెన్నెలలు గాయు' ననును. ప్రకృతియం దొక వస్తువును జిత్రించునపుడు గాని, మానవస్వభావమం దొక ధర్మమును వర్ణించునపుడు గాని, లౌకికయాత్రయం దొక ప్రవృత్తిని జెప్పునప్పుడు గాని, యది వానినెట్లు శోభింపవలయునో తలఁపింపవలయునో యారీతికిఁ దగు కూర్పులను మార్పులను గావించుకొనుచుండును. అది చమత్కారబీజము లగు నియమముల నూఁది రసభావపోషకము లైన యత్యుక్తులు నతిక్రమములును గొన్ని గలిగియుండును. అవిగో 'కవి

సమయములు 'కావ్యసృష్టి' యనఁబడును. వాని మహిమచేతనే 'కోమల తరలతలు కామనిశితాస్త్రము' లగుచున్నవి. 'కోటకొమ్మలు మింటితోఁ గుమ్ములాడు'చున్నవి. ఆ సమయముల చొప్పునఁ గవిత యొక్క దానికిఁ బెట్టు సొమ్ములను వైచు వేషమును నాడించు నాటయు దానికిఁ దగునా? కలుగునా? యని యనౌచిత్యమును గాని యసంభవమును గాని విచారింపరాదు. అవి దాని శిల్పము; దాని జాలము. వానివలనఁ దోఁచు భావములను నుద్దీపించు రసములను నాస్వాదించి యానందించుటయే రసికజనుల కౌశలము.

ఈ కవిత్వధర్మములు 'వసంతసేన'యందుఁ జాలఁ జూపట్టుచున్నవి. ఈ కృతిరచనయందలి లక్షణములఁ జర్చించి దీని కవిత్వంపు వన్నెను జూపుటయే నేనిపుడు పూనిన పని గాని వ్యాకరణాలంకారశాస్త్రవిషయము లగు తప్పులొప్పులను రూపించుట గాదు. ఇందలికథ 'గోల్డుస్మి'త్తనెడి యాంగ్ల కవి రచించిన 'హెర్మిట్' అను చిన్న పద్యనిబంధమునుండి తీసికొనఁబడినది. అందలి కథ——ఒక నాయికయు నాయకుఁడును బరస్పరము వలచి కలసియు, నాయిక తనలోని వలపు వేడుకకై నెరపక నాయకుని వెతలఁ బెట్టఁగా నతఁడు విసిగి యిలువెడలిపోయి యొక కొండపట్టున మునియై యుండ, నాయిక పశ్చాత్తప్తయై యతఁడొక నిర్జనస్థలమున మృతుఁడై యుండునని యెంచి యాచోటు కనుఁగొనుటకై మగవేషమున బయలు వెడలి వెదకుచువచ్చి యా కొండపట్టునఁ గూడికొనెను. ఇందలి కథ—— 'ఒక నాయిక యొకనాయకునిఁ బెండ్లాడియు నతనియందు వలపు నెరపకుండఁగా నతఁడు రోసి యిలువెడలి సన్న్యాసియై యొక యడవి నుండ, నాయిక యనుతాపమునఁ బురుషాకృతిఁ బూని యతనిని వెదకుచు వచ్చి యా యడవిని గూడికొనెను.——ఇదియే కథాబీజము. మాతృకయందు నాయికానాయకు లవివాహితులు; ఇందు వివాహితులు. ఈమార్పు హైందవాచారమును బట్టి ముఖ్యముగాఁ జేయఁదగినది. ఇఁకఁ బేలవ మయిన యీ కథాలవమును గవితాసంభారములు గూర్చి మధురపాకము సమకట్టి మిక్కిలి భోగ్యద్రవ్యము గావింపవలయును.

ఒక కథను దాని యుత్పత్తిపరిణామక్రమమునఁ జెప్పినయెడల, నది ముసలమ్మ యొబ్బుసుపోక ముచ్చటవలెఁ జవిగొలుపదు. దాని శరీరము నంతయుఁ బెరమాటున నుంచి యం దొక్క [illegible] పాత్రమును గొని, యేపట్టునందు మొదటఁ బ్రదర్శించినయెడఁ దక్కిన పట్టుల సన్నివేశము మఱింత సుభగమై కావ్యనిబంధమునకు మిక్కిలి సౌష్ఠవమును గూర్చునో, యే వేషమును వేసినయెడలఁ గల్పనలకును వర్ణనలకును మిక్కిలి యవకాశములు గలుగునో, యే యవస్థయందుఁ బెట్టిన యెడల భావములును రసములును మఱింత యుద్దీపించునో, యట్టి పాత్రము నా పట్టునం దా వేషముతో నట్టి యవస్థలో మొదటఁ జూపుటయే వస్తురచనాకౌశలము. ఇది నాటకసంవిధానసిద్ధము. ఇట్లు కథ నారంభించు నిబంధనలలో మొదటికి పాత్రమును బ్రదర్శించు పట్టు గదా. ఇందు ముఖ్యపాత్ర మగు కథానాయికయే కథ నడిమిపట్టునందుఁ బ్రదర్శింపఁబడినది. మధ్యభాగమునుండి కథ యారంభించుటచేత దాని పూర్వభాగము నుత్తరభాగమును——అనఁగా మొదలును దుదియును రెండును దెలియవు గాన వానిని దెలిసికొను కుతూహలము నాతురతయు మిక్కిలి గలుగుచున్నవి. ఈ కౌతుకార్తియం దాపూర్వోత్తరాంశముల నచ్చటచ్చట నొక్కొక్కటిగా సూచించి చదువరులచే నిజభావవీథియందుఁ గథాసూత్రము నందదుకులుగా నల్లించుచువచ్చి తుదను వెల్లివిరియింపఁగాఁ, గథాంశము లెల్ల నా కౌతుకరసమునం దొప్పదోఁగిన వగును. శ్రుతిచేత గీతమాధుర్య మతిశయించునట్లు, కౌతుకరసపరిప్లుతిచేతఁ గథాంశము లతిభోగ్యములై కావ్యరసమును మిక్కిలి యాస్వాద్యము గావించును. ఆఁకటియందుఁ జేలపిండియు నమృతము గదా! మఱియు నా పాత్రము నడికిన పట్టువలన దాని డాలు తక్కిన పట్టులవానికి మఱింత మెఱుఁగును నొఱపును గూర్చుచుఁ గావ్యశోభకు మిక్కిలి వన్నె పెట్టుచున్నది.——

రెండవది పాత్రము వేషము. ఇట నాయికకు మగ వేషము. కథ సాగుచున్నను నందలి యంశముల సందర్భ మీ వేషముచేఁ గప్పంబడి యేర్పడనేరదు గాన వాని మర్మము నుద్ఘాటించునట్టి భావవర్ణనములును గల స్థితిని

నిష్పాదించునట్టి వస్తుకల్పనములును నడుమనడుమఁ గావింపఁబడి రచనాప్రౌఢిని సాక్షి గావించుచున్నవి.——మూఁడవది పాత్రము నవస్థ. అది విరహప్రయుక్త మగు విప్రలంభశృంగారమందలి యున్మాదావస్థ. ఈ యవస్థవలన విప్రలంభశృంగారకరుణరసములును దాని వ్యభిచారిభావములును నుద్దీపించుట కయితి కలుగుచున్నది.

ఉన్మాద మనఁగా నిష్టవియోగాదులచేఁ గలుగు చిత్తవిభ్రాంతి. 'ఉన్మాద స్తుల్యవర్తిత్వం చేతనాచేతనే ష్వపి.' —— చేతనములందుఁ గాక యచేతనములందును వర్తించుట దాని లక్షణము. విపరీతభావన యసంబద్ధప్రలాపము మొదలగునవి దాని యనుభావములు. ఇట దాని విపరీతభావన మొదటఁ జూపంబడుచున్నది. ఒక బాటసారి (నాయిక) పొడవైన మ్రాఁకులు పట్టుగాఁ బెనఁగొని కారుకొనుచున్న యొక యడవిని బ్రవేశించెను; కాని యున్మాదజనితమగు విపరీతభావనచేతను, (స్త్రీత్వమువలని) లౌకికానుభవాపరిజ్ఞానముచేతను గాఢక్రమ్ముచున్న యా యడవిని గలమాపుఁ దెలియదయ్యె. కాఁబట్టి దట్టంపుఁ జెట్లజొంపము చీకటిగుంపు లయ్యెను. కొన్ని ప్రక్కలఁ బూచిన (యెఱ్ఱ) పువ్వుల చాలు సూర్యకిరణకాంతిగాఁ దోఁచెను.

'కలయం బ్రమ్మెను ధ్వాంత మంబరమునన్; ఖద్యోతబింబం బహో
తిలకింపం గనిపింప; దైన, సుమహాధిక్యంబునన్ మించెడిన్
గలఁకుల్ గొన్ని:'

చీకట్లు గ్రమ్మినవి. కాన సూర్యుఁడు కానరాఁడే కదా. అయినను కొన్ని ప్రక్కల సూర్యకాంతి పొలయుచున్నదే! ఈ వైపరీత్యము లేమిటి? 'చే లేమి వాటిల్లునో! విలయం బౌనో కో! ఇవి యశుభసూచకములా? విలయలక్షణమా?' —— యని భయప్రేరితమై విభ్రాంతిరసము పొంగి పొరలిన ప్రవాహము. కంటికి 'అవశకునములై యయ్యెడి' హృదయమునకు 'ఏదియో చెడు గగు నని తల్లడ' మయ్యెడి. ఇది 'గోరుచుట్టుపై రోఁకటిపోటు'. అయిన నివి విభ్రాంతి పన్నిన వెఱబొమ్మలు. భ్రమసిన కంటిక

కన్నియు బూతములే. హృదయము మిక్కిలి సానుక్రోశవృత్తి గలదిగావున నది యెప్పుడును శంకించుచుండునది చెడుగులే. కాన యవి నిజములు గావు.
—ఇట్లా ప్రవాహము పాఱుచువచ్చి యిచ్చట వితర్కశిలాపటలిఁ దాఁకి సుళ్లుగొన్నది. 'అట్లు వెఱవ నేల?' ఆ వితర్కముచేత భయము తగ్గినది; భయప్రయుక్తమగు వేగమును దగ్గినది. కాని ప్రవాహము పాఱుచునే యున్నది. కన్నులు గ్రమ్మిన మబ్బు మాఱుచునే యున్నది. కావుననే,

'తమ మిది గాదు నీరదకదంబము గాని; పయోరుహాప్తబిం
బము గనరాదు కారొ్కొనిన వారిదమాలిక గప్పియుండుటన్;
విమలతటిల్లతాద్యుతి రవిప్రభ గాదు.'

చీకటిజొంపము మబ్బులగుంపయినది. సూర్యకాంతి మెఱుపుల దీప్తి యైనది. మబ్బులగుంపే యనుటకు 'నిదర్శన' మేమి? 'పడుందోడఁగొ వర్షకణాళి'. ఇఁకఁ జింత లేదు గాని స్వభావచపలములైన యా మెఱుపుఁ దీఁగలు చలింపకున్న వేమి? కావున నది మబ్బులగుంపు గాదు, ద్రుమాంకుల జొంపము. ఇట నా ప్రవాహమునకు వితర్కశిలలు గావు, వివేకమహాశైల మడ్డపడినది. ఇఁక నా మెఱుపుఁదీఁగ లేమి? 'నవపుష్పవిశేషము.' 'ఆ వర్షకణాళి యో?' 'వివిధఫలప్రసూనరసవృష్టి'. కావున నది యరణ్యము. వనియందు వర్షభ్రాంతి కలుగునా యనవలదు. చిత్తవిభ్రమం బలమిన నేరు దృష్టి గల యంధులు గారు? అట్టి వర్షభ్రాంతివలననేకదా 'నెమ్మలు నృత్య మొనర్చుచున్నవి. చాతకములు సలిలధారలని చంచువులు చాఁచుచున్నవి. రాజమరాళములు పమ్మిన భీతి నిండ్లకు నేఁగుచున్నవి.—' ఇట విభ్రాంతి ప్రవాహ మడ్డువడి నిలిచియున్నది.

ఇట వనియందు వర్షభ్రాంతి నెమిళ్లు లోనగువానికి వర్ణించుట విపరీతము గాదు. ఇది చమత్కారైకవృత్తి యగు కవితాకల్పనాసంప్రదాయము. 'కృష్ణకర్ణామృతము'నఁ గృష్ణుని నీలి కాంతియందు గవాసులు పొందిన భ్రాంతి యిట్లు వర్ణితము:

'యాం దృష్ట్వా యమునాం పిపాసు రనిశం వ్యూహో గవాం గాహతే

విద్యుత్వానితి నీలకణ్ఠనివహో యాం ద్రష్టు ముత్కణ్ఠతే
ఉత్తంసాయ తమాలపల్లవ మితి ఛ్ఛిన్దన్తి యాం గోపికాః
కాన్తిః కాళియశాసనస్యవపుషః సా పావనీ పాతు నః. (౨. ఆశ్వా.)

ఇట్టి వర్ణనము కవితావ్యవహారధర్మము. సామాన్యవస్తువునకు విశేష స్ఫూర్తి కలిగించుటకై కవిత సమకట్టు వర్ణనాశిల్పము.

ఇప్పుడు వసంతసమయము గనుకఁ గోయిల నునుఁజిగురాకు మేసి కూసినది. ఇంతకాలము మూఁగయై యుండిన కోయిల యిప్పుడు కూయుట, అందును మనోహరముగాఁగూయుట 'మహాద్భుతకృత్యము'. అది యెవరిది? 'మాధవా!' నీది. ఇట మాధవుఁ డనఁగా విష్ణు వనియు వసంతుఁ డనియు నర్థద్వయము పొందు గనుక. అది కూయుట యెట్లున్నది? 'నీ యశ మకుంఠిత మంచును జాటు కైవడిన్'. ఇందు నుత్ప్రేక్ష సొంపు నరయునది. 'ఈ యసమాన వైభవము నెన్నఁ దరంబె!'—ఈ యింపు పెంపునందుఁ గాముకుని కంటికిఁ దోఁచున దేమి? 'వనలక్ష్మియు వసంతుఁడును బూవుపు దావియుం బోలెఁ బొల్చుట? విప్రలంభశృంగారము పొంగి పొరలుచున్న దాని కంటికిఁ దోఁచున దిదియె. అట్టిదాని నోర వెడలఁదగు మాట లివియె. ఇట్టిభావన యావిప్రలంభరసము నెగఁబోయకుండునా? ఇఁక 'దగ్ధదైవమా! న న్నేల యిట్లు దయమాలి ధాత్రిఁ బుట్టించితో' యని తిట్టకుండునా?

ఇంతలో శుభసూచక మగు నేత్రస్పందము. ఇట్టి కన్నదరుట నే వాల్మీకి 'ప్రాస్పన్దతైకం నయనం సుకేశ్యా మీనాహతం పద్మమివాభి తామ్రమ్' అనియుఁ, గాళిదాసు 'నయన ముపరిస్పందిశఙ్కే మృగాక్ష్యా! మీనక్షోభాచ్చలకువలయ శ్రీతులా మేష్య తీతి' యనియు వర్ణించినారు. ఇచట నిబిడ మగు వర్ణనావస్తువిస్తరమునఁ గొంత తెలిపిచేసి కథాభాగము కొంత ప్రదర్శింపఁబడినది. 'చిన్నియనుంగునెచ్చెలిని జేకుతినప్పుడు గర్వోన్నతిచేతఁ బొంపలే' దయ్యొ. (ఈ చిన్నియనుంగునెచ్చెలి నాయకుఁడా? నాయికయా? అది యింకను దెలియదు.) గర్వముచేతఁ బొందకుండినది మాత్రము తేటపడినది. తక్కినది తెరమాటుననే యున్నది. తెలియుకౌతుక

మో క్రేళ్లు దాఁటుచున్నది. మఱియుఁ గన్నదరుటచే శుభంబు గలుగు నని తోఁచుచున్నది. 'కాని కాకియుఁ దూఱని యిమ్మహాటవిలో శుభ మెట్లు కలుగును? కలితచిరత్నరత్నమును గాజుగఁ జెల్లదు కానివేళలన్' 'పెట్టని దినములఁ గనకపు గట్టెక్కిన నైన లేదు' గదా?

ఇంతలో సోలి సొమ్మసిల్లి కనుమూసెను. అపుడు 'మృదులస్వాదు వచోవిలాసములు' వినఁబడెను. మేను 'స్పర్శామేయసౌఖ్యంబున నవశత్వ మందెడిని'. ఇట్లు వీనుల కింపుగాఁబలికి, మేనుచొక్కఁగా నిమిరిన దెవరు? 'నా నెచ్చెలి వచ్చె!' (నెచ్చెలి నాయకుఁడా? నాయికయా? అది యిపుడు తెలియదు.) నెచ్చెలి వచ్చి యట్లు చేసెను గావుననే యీసౌఖ్యము. మఱి యొక రట్లు చేసిన నిట్టి సౌఖ్యము గలుగునా? 'ముద మొందించునె పద్మ మున్ రవి కరమ్ముల్ గాక యన్యాంశువుల్'. (ఇట పద్మశబ్దసారస్యము చేత వక్తయందు నాయికాత్వము ధ్వనితము.) మఱియు శుభసూచకము గలిగియున్నది గావున నెచ్చెలియే వచ్చె ననుటకు సందేహ మేమి? అయిన నడవిలోఁ గన్నదరినను శుభము గలుగుట యె ట్లనవలదు. 'శాన్త మిద మాశ్రమపదం స్ఫురతిచ బాహుః కుతః ఫల మిహాస్య' యని శంకించియు 'అథవా భవితవ్యానాం ద్వారాణి భవన్తి సర్వత్ర' యని దుష్యంతునిచేతఁ గాళిదాసు చెప్పించియున్నాఁడే గద. 'దైవం బనుకూలం బైనయెడల, నవని నసాధ్యం బను మాట యున్నె? మార్గము తనయంతం దోఁచును.

ఇది సరియే కాని యింతయుఁ గనుమూసియున్నప్పటి సొంపు, కలలోఁ గన్న సంపద, అద్దములోని ముడుపే కదా. కన్నులు దెఱవఁగా నెచ్చెలి వచ్చెనన్న మాట యెక్కడిది? అట్లేని యప్పుడు వినఁబడిన యెలు గెవరిది? నిమిరిన చే యెక్కడ? కన్నులు మూసికొనియున్నను జేతనమేలు కొనియున్నదిగదా. ఆ యెలుగు 'పికోక్తి', ఆ నిమిరిన కరము 'సర్వకుసు మోత్తమవాసితదక్షిణానిలాంకూరము'. వనరామణీయకము వనలక్ష్మిగాఁ గనుపట్టినది గదా కాముంపు దృష్టికి. అట్టి కాముంపు బుద్ధికిఁ బికోక్తి యా వనలక్ష్మి యాఁటపలుకు కానేరదా? ఆ పిల్ల తెమ్మెరల సోఁకు దాని

చెయి తాఁకుగాఁ దోఁపఁగూడదా? అట్లై తోఁచినది. కాఁబట్టి యీ వనేందిర ‘అనుకంప గలది.’ ‘ఓహో’ యని పిలిచినఁ బలుకువారు లేని చోట నిట్టి సత్కృతి నిర్నిమిత్తముగఁ జేసిన యీ వనలక్ష్మి కృప నెన్న దరమా?’ అయిన నిందుల కాశ్చర్య మేమి? వనలక్ష్మికి ద్విజాదరణము సమస్తవేళలందు స్వభావమే కదా. (ద్విజశబ్దముచే వనశోభ పరముగాఁ బక్షు లనియు వనలక్ష్మికాంత పరముగా బ్రాహ్మణాదు లనియుఁ దెలియునది. ఇట ద్విజశబ్దముచేత నాయిక రాజకుమారిత్వము సూచితము.)

కన్నులు తెఱవఁగాఁ దెలివి మఱలఁ గలుగఁగా సంకల్పజనిత సుఖము పోయినది. ‘నెచ్చెలి దగు పొందు శూన్య మైనది.’ నెచ్చెలి రాక లేదు. కాన మఱియు వెదకవలయును. ‘చూడఁ జుట్టును ద్రొక్కపైవసు లేని నట్టడివిలో’ నడుగుట యెవరిని? వృక్షము లచేతనములు గనుక వాని నడుగరా దనవలదు. ఉన్మాదము కంటి కవి చేతనములే. ‘కామార్తాహి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు’ అని యున్నదే కదా. కామోన్మాదముచే రామాయణమున రాముఁడును, భాగవతమున గోపికలును, విక్రమోర్వశీయమునఁ బురూరవుఁడును వృక్షాదుల నడిగియేయున్నారు. అశోకమును జూచి ‘నీ స్వకార్యమె యైనఁ దన్నినను గాని పూయ, వన్యుల కుపకృతి సేయు టెట్లు?’ అనియు, జాజికొమ్మను జూచి ‘వృక్షజాతి మరియాదన్ విడి వాసంతరక్తికిఁ బుష్పింపని జాతి తా వికటవృత్తిన్ మాను నే?’ యనియుఁ, జిలుకనుజూచి ‘ముక్కును మొగ మెఱ్ఱఁజేసికొని కోపము చూపెదు నీకు జాతి బంధన మొనరించుటం గినుక దాల్చితే’ యనియుఁ బచరించిన వాక్యముల శబ్దార్థచాతురి యతిశయించియున్నది.

ఇట్టులున్మాదరసప్రవాహము మరలఁ బొంగి వృక్షాదులపయిఁ బొరలి తెరలినది. మగుడ దానిఁ బ్రవహింపఁజేయు మార్గము గావలయును. మఱియు నుత్తరకథాప్రణాళికి నొకయనుకువను వలసియున్నది. ఆమార్గమును ఆ యనుకువను గవి కోయిల ‘కుహూవు’నం దలవరించెను. నెచ్చెలి వృత్తాంతము చెట్లును జిలుకయుఁ జెప్పవయ్యె. కోయిలను బోయి ‘నత్రి

యాస్యపుం దుహినకరుం డెక్కడ?' నని యడుగఁగా నది 'కుహూ' యని బిట్టు కూసెను. (కుహూ యనఁగాఁ గోకిలధ్వని. 'పల్లవగ్రాసకషాయకంఠకల కంఠకుహూకాకలకాకలీధ్వని' యని కవిప్రయోగము. కుహూ యనఁగాఁ జంద్ర కళ కానరాని యమావాస్యయు.) కోయిల 'కుహూ' అనఁగానే కామోన్మత్తుఁ డగు బాటసారి 'నెచ్చెలి మోముచందురునిఁ గుహువు గ్రసించిన' దని, అనఁగా నెచ్చెలి మృత్యుగ్రస్తుఁ డయ్యె నని యది చెప్పినట్లుగా భావించుకొనెను. ఇట్టి భావన విప్రలంభోన్మాదమున వింత గాదు. ఇట్లు 'నెచ్చెలి మరణించె' నన్న సంకల్పము గలిగించి కవి యుత్తరకథావిస్తరమునకై నడుమ మఱియొక బీజము మొలకెత్తించెను. మాతృకయందు నాయకుఁడు నిర్జనస్థలమున మరణించె నని నాయిక తలఁచి యా ప్రదేశమును గనుఁగొని యచ్చటనే తాను మృతి పొందఁదలఁచిన దని చెప్పఁబడినది కాని నాయకుఁడు నిర్జనస్థలమున మృతిఁ బొందె నని నాయిక కెట్లు తెలిసినదో లేక తోఁచినదో వివరింపఁబడలేదు. ఇట 'కుహూ' శబ్దశ్లేషముచే నాయకుఁడు మరణించె నను భావ మున్మత్తనాయికకుఁ దోఁపించిన కల్పనాచాతురిం గాంచునది. ఆ భావమువలన విప్రలాపము. దానివలన స్వమరణనిశ్చయము. ప్రాణత్యాగమునకై వన్యమృగముల వాతం బడియు, నవి 'మానవాభావకాంతారావాసముచే నెఱుంగవో కో మర్త్యక్రవ్యపుం దీపి!' యను కారణముచేతంబోలె మ్రింగవయ్యె. నీరఁ బడి చచ్చుటకు జలాశయము లేదు. ఉరిఁ బెట్టుకొనుటకుఁ ద్రాడు దొరకదు. ఒక తీఁగను త్రాడుగాఁ గొనరాదా యన్న 'మడియుట సంసిద్ధమై శ్రమము నిక్కమనును.' ఇది 'ముల్లు పుచ్చికొఱ్ఱడిచినట్లె'. వట్టి 'దీర్ఘమరణయాతన'యే.

కరుణరసోద్దీపకమును భావప్రాగల్భ్యభాసమానము నగు వర్ణనాపటలము నడుమఁ గొంత తెఱపి దీసి కథాంశము ముక్కను మఱికొంత కవి ప్రదర్శించెను. ఆ చెలి 'మహితక్షత్రకుటుంబమందు జనియింపంగన్నది'. అట్టి దానికి నచ్చటఁ ద్రావ విషమును దొరకదయ్యె. ఏల? 'ఇట్టివ కావె స్వస్థలబలవ్యస్తప్రయత్నావధుల్'. ఇట్లు దిక్కులేనివారికి దేవతలే-దేవుఁ

డగు పావకుఁడే దిక్కు. కాన యగ్నిని జొచ్చి దేహము విడుచుట తగును. ఏల మరణమం దింత పట్టు? ఇచటి కథాంశము మఱియొకటి. 'నేనున్ నా చెలియున్ బరస్పరము నిర్నిద్రానురాగంబు సంధానంబైనను దాంపత్య ధర్మం బిటుఁ బొందలేదు. దీనిచే వారు పెద్దలచే వివాహితు లయ్యు దాంపత్యధర్మము జరుపరైరి. 'అనన్యానీతాత్ములమై దివిం గలసికొ వర్థింతుము'—ఇఁక మఱియొకరిచేతఁ గాక తమంతటనే స్వర్గమునఁ గలసికొన నున్నారు గాన మరణ మొందక తప్పదు. అంగుల కగ్ని యెక్కడ? అదిగో నొక దీపము. అగ్నిదేవుఁ డా రూపమున సాక్షాత్కరించినట్లు వెలుఁగుచున్నది. అదియే యా చింతాసముద్రమునఁ 'దరణోపాయము'. చింతకన్నఁ జితయే మేలు. ఏ లనఁ జింతను బాపఁ జితయే సమర్థ మైనది.

'చిన్తాయాశ్చ చితాయాశ్చ బిన్దుమాత్రవిశేషణమ్
చితా దహతి నిర్జీవం చిన్తా దహతి జీవినమ్.'

అను నభియుక్తోక్తి యున్నదే కదా. ఆ యగ్నిప్రవేశము సేయఁగానే పూర్వార్జితపుణ్యరాశిని జెలిని (నాయకుఁడా? నాయికయా?) సందర్శింపఁ గలుగును. ఇట్లు నాయకసమాగమస్మృతిచేత స్మరోద్దీపనము. కావుననే 'వనరుహాస్త్ర! యిపుడు వానముందరి యుక్క, పోలె నను దహింపఁ బూనితేల?' ఇట 'వనరుహాస్త్రశబ్దము' సాభిప్రాయము. 'ఏ ననంగతనువహించిన నీ గతి యేమి యగునో చూడు మింక మీఁద'. ఇందు శ్లేషానుప్రాణిత మగు భావచమత్కృతిని గనుఁడు.

ఆ దీపమును దఱియు కొలఁది నది దవ్వుగ జరుగుచున్నది. నడచి పాదములు తడఁబడఁజొచ్చినవి. దైవమో కావదయ్యె. 'అనుఁగుఁ జెలీ! నీవును నన్నుఁ గొనిపోవ రావు. స్వస్థతచేత నా స్వస్థతఁ గన్నం బ్రేముడి సన్నగిలునే?' (ఇట స్వస్థశబ్దసారస్యముం జూపుఁడు.) దీపము దొడవ్వుగఁ బోవుచునే యున్నది. మరణదశాక్రాంతుఁడు వచ్చిన బాటసారి నూరక ముగియిక లేని జాలిఁ గొలుపుట విరసము. ఇంతవఱకు నేకపాత్రముతో నొక్కటే పాటగాఁ జెప్పిన కథాసరణిని పాత్రాంతరసమ్మేళనముచే

నుతియొక్క మార్గమునఁ ద్రిప్పిననే సరసముగా నుండును. లేకున్న నింత వఱకే యున్మత్తక మైన రసము వెగ్గలమై రుచింపకపోవును. ఇది పాత్రాంతరము.

'చారుహరిత్తృణావృతవిశాలతటాంచలమున్ బ్రసన్నవాః
పూరము నౌ తటాకమునఁ బోల్చుగు శైవలయుక్తపుల్లక
ప్లారము రీతి వల్కలములన్ దన మేన ధరించి యీరపున్
ద్వారమునన్ జెలంగెడి నెవండొ మనోహరమూర్తి యెంతయున్.'

ఒక జడదారి కనుపట్టెను. సహగమనమందే తాత్పర్యము గలిగి యున్న బాటసారి యా జడదారిని దీపమును జేర్చుటకు సాధనమాత్రముగాఁ గొనుటయె స్వభావము; కాన యాతనిఁ జూచి 'ఆ ప్రదీపికదరిఁ జేర్పుమయ్యా' యని యింతే యడిగెను. మాతృకయందలి దీపమునకిట్టి సార్థక్య మంతగాఁ గానరాదు. విశేషించి, యీ దీపమునకు 'స్నేహప్రధానతఁ దనరునట్లు' 'పాంథజనమార్గదర్శి' యను విశేషణములందలి 'స్నేహ' 'పాంథ' శబ్దముల శ్లేషవిభవము శ్లాఘనీయము.

ఇంతకును బయిపై నడచుచున్నది దీపమా? దీపమునకుఁ గాళ్లు గలవా? ముని యది కోఱవిదయ్య యని చెప్పి యా బాటసారికి వనలక్ష్మి సమకట్టిన పదార్థములచేతనే విందు పెట్టెను.

'పండి తేనియ లొలుక మెత్తని పైఁడిగిండ్లను బోలు బల్
కొండపండ్లను వెండితుంపరగుం పనం గడు స్వచ్ఛమై
నిండి పర్వెడి యేటితీయనినీరమున్ గయికొమ్మటం
బండువెన్నెలబైటఁ దేఁటుల పాట లింపు ఘటింపఁగన్.'

ఈ సందర్భమున మాతృకయందుంబోలె ముని 'ఆత్మవత్సర్వభూతాని'—యిత్యాదినీత్యుపన్యాసము చేయుట తెలియునది. 'స్థావరప్రాణిహాని' వృక్షలతాదులు స్థావరజంతువు లనెడి నవీనప్రకృతిశాస్త్రపరిశోధకుల మత ముదాహరింపఁబడినది. 'పత్త్రిఫలపుష్పములు గూడ వలయునంతకధికముగఁ గోయఁ జేతులాడ'వఁట. అట్లైని తనకే కాక మఱొకనికిఁగూడ

వలయునంత యధికముగా శాకాదులను సంతరించుట యుపపన్నము కాదు. ఈ యనుపపత్తి 'అతిథి రాక భగవత్సంకల్పము గావున నది యట్లు సమకట్టించిన దని పరిహరింపఁబడినది.

మాతృకలోని పిల్లికి మాఱుగా నిందలి లేడిపిల్ల మతింత ముద్దుగాను గాళిదాసు శకుంతల కిచ్చిన లేడిపిల్లకు నుద్దిగాను నున్నది. తరువాతి మూఁడు పద్యాను లతిహృద్యములు. అందు మొదటిగి

'ఎట్టెటొ కూయుచున్న మతి కింపు ఘటింపవు బాటసారికిన్
గట్టెగుటం గనంబడెడి కమ్రకురంగకుమారి యాటలున్
బిట్టలుఁ గుమ్మొదల్ గలసి వేఁక్కమెయిన్ వినిపించు పాటలున్,
దట్టపు జ్యోత్స్న తేటలును, ధైర్యము గొల్పెడి మౌని మాటలున్.'

జడదారి యెంత ధైర్యము చెప్పినను బాటసారి వెక్కి వెక్కి యేడ్చుటను జూచి 'దుఃఖహేతువు గోప్యమో? దుఃఖభరము మాట రానీదో?' యని యడిగిన మాటలు ములుకులై మర్మము నాటినను మరణనిశ్చయమున నుండుటచే నతఁడు 'జీవితాశ లేని నాకు నింటితగుల మేల కల్పించెదు?' వని పలికెనే కాని మర్మము చెప్పఁడయ్యె. ఆ బాటసారి దుఃఖమునకు వనలక్ష్మియు 'మరందమయబాష్పశ్రేణి వర్షించినది'. ఇట్లె 'మేఘమాత' యందు యక్షుని దుఃఖమునకు 'ముక్తాస్థూలా స్తరుకిసలయే ష్వశ్రులేశాః పతన్తి' యన్నట్లు వనదేవతలకును నశ్రుబిందువులు చెప్పఁబడినవి. మనుచరిత్రమునందు వరూథినియెన్నిమురువులుచూపినను నిస్పృహుఁడగు ప్రవరునిచే 'నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొ'మ్మనిపించినట్లె యిట మౌనిమాటలు మర్మము గాఁడినను 'నాకమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొ' మ్మని బాటసారిచే నింతే పలికించినవి గాని యతని మర్మములను జెప్పింపఁజాలవయ్యెను. ఇంకను బలీయ మగు ప్రయోగముచే లోని మర్మము నుద్ఘాటింపవలయును. మనుష్యస్వభావమునందే యిట్టిసాధనమును గవి సమకట్టెను. ఎట్లన — ఆ మునియుఁ బూర్వము తన వలపు భగ్నమై నందునఁ గా నిపు డట్టి స్థితి నొందినవాఁడు గావునఁ దన విహారకారణమే

యా బాటసారికి నుండనోపు నని శంకించి యా కారణమును నర్మగర్భ
ముగా నన్యాపదేశముగా

'మైత్రి యనురాగ మివి రెండు మహిని లేవు,
అవి ధనముతోడి నీడలై యాస గొలుపు;
ఒకొ్కకెడ మైత్రి యుండిన నుండుఁ గాని
నిర్మలానురాగం బది నిండుసున్న.'

'అనురాగజాడ్యదోషము
వనితలకే, యందు విత్తవతులకు, నధికం
బని తెలిసియు వలవంతల
వనరెడి పూరుషులు వెఱ్ఱివారలు గారే?'

'ఒక క్షణ మున్న చిత్తము మఱొక్కక్షణంబున కెల్ల మాఱెడిన్,
త్రికరణశుద్ధి సున్న, మృగతృష్ణలఁ బోలు విలాసవైఖరుల్,
ప్రకటము సాహసంబు మఱి స్పర్ధకు మేరయె లే — దహో కటా
సకల మెఱింగియుం బురుషజాతి సెలంతలకై తపించెడిన్.'

ఈ వాక్యములు ముని తెరమాటు చరిత్రములోని బలు కీలును బట్టి
యిచ్చుచున్నవి. ఎవతియో యొక సెలంత యతని కా యలంత గలిగించి
నది. కావున దానికే యా యుపాలంభపుఁ బోటు గావలయును. కాని
యిది నడిమంతరపు బాటసారి మర్మము గ్రుచ్చి యిచ్చిపోవ నేల?
వానికి రోషనిష్ఠురతలను బుట్టింప నేల? ఆ పోటు, అట్టి సెలంతయై పఱ
చినదానికేకాని, యట్టి సెలంతచేఁ బడ్డవానికిఁ గాదు. కాఁబట్టి యా సెలం
తయే యా బాటసారి యగునా? కవి పన్నిన యీ యుపాలంభపుఁ
బోటుమాటలవలన ముని గుట్టును బాటసారి మర్మమును గొంత తెరమాటు
నుండి బయలు తొంగిచూచినది. కాని దాని ముఖ్యభాగము తెరమఱుఁగు
ననే దాఁగిలిమూఁత లాడుచున్నది. దానిని మఱింత వెలారించుటకే యీ
రోషనిష్ఠురతలు. బాటసారి

'మీ రెవ్వారలు చంద్రవర్మవలె గంభీరార్థముల్ పల్కుచు

న్నారల్ భగ్నమనోరథుల్ సయిత మన్యాయంబుగా నీగతిన్
నారీలోకము నెల్ల దూఱెదరె? కాంతల్ సేయు నేరంబులన్
ధీరోదాత్తులు దిద్దఁబూనక విరక్తిం బూను టౌచిత్యమే?'

'చంద్రవర్మను మృతుని నిష్కారణముగ
నిపుడు పేర్కొని తెగడితి — నేమి సేతు?
చేడె యెవతెయొ యతని వంచించెఁ గాని
సుగుణి యతఁడు దూషింపఁ డా సుదతి నైన.'

ఆ ముని మాటలు చేడె యెవతియో వంచించిన చంద్రవర్మని గంభీరార్థములవలె నున్నవఁట. ఆ మునియే చంద్రవర్మ యేమొ! ఆ మాటలచేనా చేడెకుఁ గలుగవలసిన రోషనిష్ఠురతలు బాటసారికిఁ గలుగ నేల? బాటసారియె యా చేడె కాఁబోలు! కాదేని యా చంద్రవర్మ యెవఁడు? ఆ చేడె యెవతి? ఇంకను విచారింతము. 'చంద్రవర్మను మృతుని' యన్నట్లు మృతుఁడగు చంద్రవర్మ కుహూవు మ్రింగిన బాటసారి చెలి యగునా? కాదేని, యా చంద్రవర్మ మృతి లోనగువానికి నా బాటసారి సామాన్యముగా వగచునే కాని కుహూవు మ్రింగిన తన చెలికిం బోలెఁ గలంకఁబాఱి కన్నీరు మున్నీరుగా విలపింప నేల? నెలంతల నుపాలంభించుటచే నా ముని చరిత్రమును బాటసారి చరిత్రమును మఱికొంత బయలుపడినది. చంద్రవర్మ మృతుఁడన్న మాట మఱియుఁ గొంత మర్మమును ముందఱికిఁ ద్రోయుచున్నది. చంద్రవర్మ మృతుఁడనఁగానే ముని 'పాపము శమించుఁగాత! చంద్రవర్మ ... ఉన్నాఁ' డనఁగానే యా మాట బాటసారికి శోకప్రవాహము నడుమఁ దెప్పగాఁ దోఁచినది. వాని కన్నీ రెండినది. కాని 'యా చెలినె లక్ష్యముగఁ బూని, యుగ్రతపమును గావించుచున్నాఁ' డనఁగా స్త్రీజనైకసాధారణ మగు లజ్జ గలుగ నేల? ఆకన్నీటి కఱువులో లజ్జ పంటపండిన దెట్లు? ఇంతే కాదు.

'సాంద్రరాగవ్యాజసాంధ్యారుణద్యుతుల్
గండభాగములపై గంతు లిడఁగ

మంజుముఖేందుండు మందాక్షమేఘవి
కలదరస్మితచంద్రికలను బఱపఁ
గమనీయపీనవక్షము నిర్భరానంద
బాష్పాప్తిఁ బులుకలువాఱి యుబుకఁ
దనుయష్టి మించి యధరపల్లవంబు శ్వా
సానిలాహతిఁ జేసి యల్లలాడ. '

ఇ వన్నియు బాటసారి కేల ? ఏల యన నేల? ఆచేడె ఆ నెలంత యా బాటసారియ. అదియ చంద్రవర్మను వంచించి వలపించి విచారాబ్ధి బడఁ ద్రోసినది . ఇంకను సందేహ మేని, 'పురుషవేషంబు నెడలించి పాలిచె నపుడు మేఘనిర్ముక్త యై మించు మించువోలె'. ఇప్పుడేని బాటసారి యా చేడియయే యని ముమ్మాటికిఁ జెప్పవచ్చును గదా !

ఇఁకఁ జంద్రవర్మ యెవఁడో యాముని యెవఁడో చిటిపొటి జాడలచేఁ గాక బాహాటముగాఁ జూపవలయును. ముని బాటసారి యా చేడె యని తెలిసికొనెను. ఆ చేడె యా ముని నింకను దెలియకున్నది. కావున నే యాతని పాదములం బడి చంద్రవర్మను జూపు మన్నది. విరక్తుఁడా మునికిఁ జంద్రవర్మను జూపఁదగు నింతే కాని యా చేడె రాగదార్ఢ్యమును దెలియఁగోర నేల! ముందా రాగము ప్రిదిలిన ఫలము గన్నవానికే కదా యిపుడా రాగము దృఢముగా నున్నదా యని యెఱుఁగవలయును. ఆ మునికిఁ జంద్రవర్మ చెలికాఁడు గాన వాని మేలునకై యాతఁ డట్లు పరిశీలించె నందమా ! ఇంటిని భోగములను మాని యడవులం బడి వెదకుచుఁ గన్నీరు మున్నీరుగా వగచుచున్న కాంతయం దింకను సందియము చంద్రవర్మ చెలికానికిఁ గలుగునా? అది కేవల చంద్రవర్మకే కలుగఁదగును. ఏలన, నా చేడియ రాగమునం దిపు డంత నిశ్చయము గానంబడినను, 'వంచించి వలపించి వెతలంబెట్టిన ' పూర్వనిరాస మతని మనస్సునందుఁ జాలఁ గాలము పాదుకొనియుండుటం బట్టి, యా నిరాసవాసన యంతటి నిశ్చయమును గూడఁ దోడనే నమ్మలేనంత బలవంతముగా నున్నది. కాఁబట్టి

యా రాగనిశ్చయమును గూడ నమ్మనంతటి నిరాసమును గడిచినవాఁడే— ఆ చంద్రవర్తయే—రాగదార్ఢ్యము పరీక్షించుట యుక్తము. ఈ పరీక్ష యయుక్తము గాదు. ఆ చంద్రవర్త యా చేడియం జూచి

'వలపించి వంచించి వలవంత ముంచి
వరుని మహాఘోరవనవాసిఁ జేసి
పలుబాములను బెట్టఁ బొల్పడినట్టి
వధువు నేవిధి నమ్మవచ్చునో చెపుమ.
చలచిత్త మొకటఁ బశ్చాత్తప్త మైన
శాశ్వతం బని యెన్నఁజన్నె యా సరణి?
కలికీ! గసాభాసకష్టదాంపత్య
ఘటనాఘమున కొడిగట్ట నే నోప!'

నన్నాఁడు. అందులకా చెలి ప్రతితర్కము లాడలేదు. యుక్తులు చూపి యాక్షేపింపలేదు. అట్లు చేయుట రాగమునకుఁ దగును గాని దృఢ రాగమునకుఁ దగదు. అది యా దెబ్బకు నిలుపోపఁజాలదు. 'హా! హత నైతి' నని నేలకు వ్రాలుటయే యది చేయనోపిన పని. అట్లు వ్రాలుటయే యన్నిటికిని బలీయ మైన ప్రతివాదము. అదియే సకలసంశయములకును సవాసనచ్ఛేదము.

స్త్రీల యుపాలంభనము రోషావేశము గలిగించి నాయిక నెట్లు వెలిపుచ్చినదో వసంతసేన మూర్ఛయు శోకపారవశ్యమున నట్లే నాయకుని బయటఁబెట్టినది. మాతృకయందు ముని యుపాలంభించినంత మాత్రనె నాయిక తన్ను బయలుపుచ్చిన దని యున్నది. ఇదట్లు గాదు. ముని యుపాలంభనముచే రోషముగొని బయలుపడఁ దమకించినది గాని బయలు పడ దయ్యె. ముని యా కీలు తెలిసి మృతుఁ డని తలంపఁబడిన నాయకుని బ్రతికియున్నాఁ డని తెలుపఁగానే మనస్సు నిష్కంటకమై శృంగార బీజప్రరోహమునకు మరలఁ బక్వ మయినది. ఆ పదను దెలిసి 'ఆ చెలిని గూర్చియే తపస్సు చేయుచున్నాఁ' డనఁగానే లజ్జ మొలకెత్తి రెక్కొన

సాగినది. ఆ లజ్జయే నాయికను బట్టియిచ్చినది. ఇది మఱింత స్త్రీజన స్వభావానుగుణముగా నున్నది. మూలమందు నాయకుఁడు నాయిక బయలు పడినంతనే నిలుపోపక తానును బయలుపడినట్లున్నది. ఇందో నాయకుఁడు నాయిక తన పాదములం బడియుఁ జలింపక రాగప్రవృద్ధిమను బరీక్షించి యాబిడ గాఢమూర్ఛవలని శోకముచే బయలుపడినాఁడు. ఇది పురుషస్వభావానురూపముగానున్నది. ఇట్లు స్త్రీ పురుషులు లజ్జాశోకములవలనవరుసగా నొండొరులకు బయలుపడుటవలన నిందు వారి యుదాత్తస్వభావములు మిక్కిలి విలసిల్లుచున్నవి.

నాయిక మూర్ఛ కారణముగ నాయకునికి విప్రలాపము గూర్చి కథాసామగ్రికిఁ జెప్పఁబడక మిగిలియున్న రెండొక విషయములను గవి యావిష్కృతము చేసెను. ఆవిషయము లెవ్వి యన, ఆ నాయిక కురంగేశ్వరపురరాజు కూఁతురు. దాని పేరు వసంతసేన. అదియ పతికొఱకి ట్లయినది. చంద్రవర్మయో ఫణిపురి రాజకుమారుఁడు. వానికిఁ బిననాఁడే తలిదండ్రులును రాజ్యమును బోయిన వయ్యె. తుదకు దానిని గూడఁ గోల్పడినంత రిత్తస్థితి గలిగినది. దీనిం బట్టియే కాఁబోలు వసంతసేన యతనిని మొదట నలక్ష్యముగాఁ జూచినది. ఇది మనస్సునఁ బెట్టుకొనియే యతఁడు

'ఆరయ విత్తవంతులకె లక్ష్యములు భవన
వాసమును జాయసౌఖ్యంబుఁ బౌరుషాక
రత్వము ననంగ వినలేవె ?'

యున్నాఁడు, తక్కిన కథాంశము లందందు నిరూపితములు. మూర్ఛ దేలుచున్న నాయిక శోకము నిలుపలేక తన్ను బయలుపుచ్చుకొని విలపించుచున్న నాయకుని వాక్యములు విని చివ్వన లేచి లజ్జచేఁ దొలఁగి పూఁదీవలందు మఱిఁగి నాయకుం జూచినది. నాయకుఁడు నట్లె చూచుటను జెప్ప నేల ? ఇట్లు పరస్పరాలోకన మైనంతనే

'తరతర మప్రయత్నముగ దగ్గఱఁ జేరి వధూవరుల్ పర
స్పరవిరహాసహిష్ణుతను వ్యక్తము సేసెడి దీనవాక్యముల్

స్వరనిగమోక్తమంత్రములు సంస్కృతిభావము సంఘటింపఁగాఁ
బరిణయసంస్కృతిం గనిరి బాహులు మంగళసూత్రమై తగన్.'

మూలకథయందు హైందవుల యాచారములకును రుచులకును ననుగుణముగాఁ గావించుకొన్న మార్పులు నేర్పును జూపుచున్నవి. ఆంగ్లకవనరీతిని బ్రకృతిస్వభావవర్ణనములతోఁ దొడంగినను మన యాలంకారిక నియమములకు గవిసమయములను ననుసరించియే మొత్తమునకు రచనలు గూర్పఁబడినవి. వస్తురచన నాటకసంవిధానమంగుంబోలెఁ జిత్రసందర్భమై చమత్కారకారిగా నున్నది. వర్ణనలు ప్రబంధకవనమునంగుంబోలె రమ్యములుగా నున్నవి. అర్థములు ప్రౌఢకవిత్వమునం బోలెఁ బటుభావవ్యంజకములై చిత్తరంజకములుగా నున్నవి. శైలి పదములను దీర్చి కూర్చిన సంతనచేతఁ గుంటువడకయుఁ దొట్రువడకయు నిరర్గళమై పటుమధురపదగుంఫనమువలన మంచి జిగిబిగి కలిగి యర్థాన్వయముల క్లేశము లేమిచే నాతికఠినమై నడచుచున్నది. విశేషించి, పదబంధమునంగుఁ బటుసంస్కృతపదార్భటి మిక్కుటముగా నున్నందున నది మెడను గంటలు గట్టిన మేటి యాఁబోతువలె సశబ్దముగాను, మత్తిల్లిన యేనుఁగువలె నుద్ధతముగాను, ప్రౌఢయగు కాంతవలె నిశ్శంకముగాను నడచుచున్నది. మఱియు నాయా సందర్భము లొండొంటితోఁ బెనఁచి ముడివైచినట్లు మిక్కిలి నుత్తముగాఁ గూర్పఁబడియున్నవి. కథాప్రణాళియందు నాయా సందర్భముల నొండొంటితోఁ బొందించుటకుఁ గాని యాయా వస్తువుల నగుపుటకుఁ గాని కవి కల్పించు భావముల చతురిమయు నర్థముల చమత్కృతియుఁ జిత్రములు గను శ్లాఘాపాత్రములుగను నున్నవి. మొత్తమునకుఁ గవిత శబ్దసౌష్ఠవముచేఁ బటువై, యర్థసౌరస్యముచేఁ బ్రౌఢమై, భావరసభరితత్వముచేత మంచిజీవమును జవమును గలిగి వెలుఁగుచున్నది.

పిఠాపురము
6—1—1920

తంజనగరము తేవప్పెరుమాళ్లయ్య
సూర్యరాయాంధ్రనిఘంటుకార్యాలయము

శ్రీరస్తు

# వసంతసేన

## అవతారిక

పురుషవ్యవస్థ గల
సృష్టి తగన్ నిజసచ్చిదాత్మక
శ్రీపరిణామమై, యెసఁగఁ
జేయుత శక్తిసమేతుఁ డీశ్వరుం
డా పరమస్వరూపము స
మగ్రము గాఁగ నఖండరాగలీ
లాపరిపూర్ణమోహమును
లాలితరీతి గృహస్థకోటికిన్. 1

క. నా తల్లిమరణ మాదిగ
భూతలశయనంబు నేకభుక్తియు వ్రతముల్
నాతండ్రి; కిది తలంచుడు
నేతత్ప్రణయకృతిరచన కిచ్చ జనించెన్. 2

ఉ. సత్యము, ధర్మమోక్షముల
సంగతికిన్ దగి యర్థకామము
ల్నిత్యసుఖంబుఁ గూర్చు నవ
లీల జనంబులకున్ బవిత్రదాం
పత్యము కారణంబుగఁ; బ్ర
మాణమతిన్ గృతి కట్టిశుద్ధదాం
పత్యముఁ బ్రోషితప్రియస
మాగమమున్ గథగా గ్రహించితిన్.

చ. భ్రమపడ గ్రామ్యవాద మొక
 వంకఁ బురాతనసంప్రదాయదా
స్యము మరియొక్క వంకఁ గన
 నౌ; సమకాలికు లీస్వతంత్రకా
వ్యము నియమాంచితంబు నెటు
 లారయువారొ? విచార మేటి, కీ
క్షమ ననుఁబోని పాఠకుఁడు
 గల్గకయుండునె యొక్కఁడేనియున్? 4

ఉ. పాయక మద్గురుండు బుధ
 వంద్యుఁడునైన జయంతి భావనా
రాయణ సత్కవీశ్వరునిఁ
 బ్రస్తుతి సేసెదఁ; గీర్తిశేషుఁడౌ
నాయసమానధీరు ప్రతి
 భాతిశయంబు జగద్ధితంబుగా
నాయతనంబుఁ గాంచుత మ
 దాత్మసరోరుహమందు నిచ్చలున్! 5

తే. ఎంత ప్రతిభాతిశయ మున్న నేమి ఫలము?
ప్రథితసారస్వతమునకు వ్యాప్తి సున్న,
యడవిఁ గాచిన వెన్నెల యయ్యె నెల్ల;
రసికపాఠకుల్ గలరె యాంధ్రజగమందు? 6

క. రాజప్రజాశ్రయము ల
వ్యాజములుగ నాంధ్రవాఙ్మయము దేశీయ
శ్రీజనకముఁ బూజ్యమునై
రాజిల్లుంగాత భాసురసువర్ణగతిన్! 7

శ్రీ ర స్తు

# వసంతసేన

## అంకితము

చిననాఁడె తలిదండ్రులను గోలుపోయిన
బిడ్డను నను౯ బెంచి పెద్దఁ జేసె,
చిన్నతనపుఁజేష్ట లెన్ని సేసిన వాని
మనమున నిడక ప్రేమంబె చూపె,
అమితానుకంప విద్యాబుద్ధులను నేర్పి
తల యెత్తుకొన నొక దారిఁ జూపె,
వ్యాయముఁ బ్రయాసంబుఁ బాటింప నుత్సాహ
మలర నన్నొక్క గృహస్థుఁ జేసె
ఆర్యుఁడు కొరళ్ల సుబ్బరాయార్యవర్యుఁ;
డతని ఋణమును దీర్ప శక్యంబె? యైనఁ,
జంద్రునకు నూలుపోఁ గన్న సరణి నతని
కీర్తిమూర్తికి దీని నంకిత మొనర్తు. 1

ఉ. నాఁటిది నేఁటిదే? ఋషుల
నాఁటిది మా యనుబంధ; మింకఁ బల్
మాటల వేల? యాంగిరస
మాని సమానుఁడు గోత్రసంపుటిన్;
నాటిన నాఁటి బాంధవము
నాఁటికి నాఁటికి వృద్ధి గాంచి మా
నాఁటఁ గుటుంబమైత్రిఁ బరి
ణామము నందె సమంజసంబుగన్. 2

ఆ. బ్రాహ్మణులము మేము వైశ్యులు వా; రైన,
వారి వరుస పిలుపులే విశేష;
మతఁడు నాదు తండ్రి యాబాల్యమిత్రులు,
రాజు మంత్రివోలెఁ దేజరిలిరి. 3

శా. ఆ విద్వన్మణి సుబ్బరాయఁడు స్వయం
వ్యక్తిత్వ మేపార స
ద్యోవిజ్ఞానచమత్క్రియాఢ్యతఁ బ్రభు
త్వోద్యోగి యై తద్గత
ప్రావీణ్యంబున నున్నతిన్ గని యశః
ప్రాగల్భ్యముక్తావళీ
ధావళ్యంబున ముంచి తేల్చెఁ గకుబం
తం బుర్వరామండలిన్. 4

తే. వివిధభాషాకళావేత్త వేదవిహిత
కర్మశీలుఁడు జ్యోతిషగ్రంథకర్త
సప్తసంతానకీర్తిప్రశస్తమూర్తి
సతతవిద్యాన్నదాత సన్నుతుఁడతండు. 5

తే. తనదు ధర్మముల్ తన యనంతరము కూడ
శాశ్వతములుగ మరణశాసన మొనర్చె;
నేఁటి మెఱమెప్పు దాత లా మేటి దాత
సాటి వత్తురె? యతఁడె ప్రశస్యుఁ డెందు. 6

గ్రంథకర్త

శ్రీ ర స్తు

# వసంతసేన

కలయన్ గ్రమ్మెను ధ్వాంత మంబరమునన్;
ఖద్యోతబింబం బహో
తిలకింపన్ గనిపింప; దైన సుషమా
ధిక్యంబునన్ మించెడిన్
గెలఁకుల్ కొన్ని; యహం బి దింత కరయన్—
జే క్షేమి వాటిల్లునో?
విలయం బానో కో? శాకయున్న నిఁక లీ
విడ్డూరముల్ కల్గునే? 1

తే. ఏ ముహూర్తంబున నిశాంత మెడలితినోకో?
యపశకునములె యయ్యెడి నకట! 'గోరు
చుట్టుమీఁదను రోఁకటిపెట్టు' పగిది
నెదియొ చెడు గగు నని తల్లడిలు నెడంద. 2

తే. ప్రాణపద మైన నెచ్చెలిఁ బాసి కూడ
వ్రయ్యకుండినయట్టి యీ పాడు హృదయ
మింతకన్న నెక్కువ కీడిఁ కేమి కలుగు
నని యిఁటు విషాదపడుచున్నయదో యెఱుంగ. 3

తే. హృదికి మించి సానుక్రోశవృత్తి గలది
కానరా దెందుఁ; దద్వృత్తి కారణముగఁ
గీడునే యది యెప్పుడు శంకించుచుండుఁ;
బ్రేమలక్షణ మిది; యిట్లు వెఱవ నేల? 4

చ. తమ మిది గాదు నీరదక
దంబము గాని; పయోరుహాప్తబిం
బము గనరాదు కార్కొనిన
వారిదమాలిక గప్పియుండుటన్;
విమలతటిల్లతాద్యుతి ర
విప్రభ గా; దిఁకఁ జింత యేల? భా
వమ! యిదిగోఁ బడందొడఁగె
వర్షకణాళి నిదర్శనంబుగన్. 5

* * * * *

చ. అల చలనస్వభావతటిదాళి చలింపకయున్న దేల? హా!
తెలిసియు నెంత భ్రాంతిపడితిన్ వని గన్గొని వర్షబుద్ధిమైఁ?
దలఁపఁగ నింతకన్నఁ గలదా యవివేకము? చిత్తవిభ్రమం
బలమిన నేరు దృష్టి గలయంధులు గారు? విచార మేటికిన్?

ఉ. నెమ్ములు పింఛముల్ విరియ
నృత్య మొనర్చు మిళిందబృందగీ
తమ్ముల కిమ్ముగా; సలిల
ధారల నానఁగఁ జాతకమ్ముల
భ్రమ్మునఁ జూఁచుఁ జంచువుల;
రాజమరాళము లేఁగు నిండ్లకున్
బమ్మిన భీతి; నావలెనె
భ్రాంతి వహింపఁగఁబోలు నివ్వియున్. 7

చ. అవిరళపర్ణశోభితదిగంతవిగాహిలతానిగూఢకై
రవరిపుమండలంబును, శిరఃపరిచుంబితమేఘమార్గమున్,

భువనవిలాసకారినవపుష్పవిశేషవిభాసమానమున్,
వివిధఫలప్రసూనరసవృష్టిమయంబు నరణ్యమియ్యెడన్.

ఉ. ఈ యసమానవైభవము
నెన్నఁ దరంబె విరించి కైన? నా
హా! యిది యెల్లఁ దావక మ
హాద్భుతకృత్యము కాదె? మాధవా!
కోయిలమూఁక లేనునుఁజి
గుళ్లను మేసి మనోహరంబుగాఁ
గూయఁదొడంగె నీ యశ మ
కుంఠిత మంచును జాటు కైవడిన్. 9

* * * *

తరు. ఈ వనలక్ష్మియు నీ వసంతకుఁడు
నెంత తపం బొనరించినారొకో?
పూవును దావియుం బోలె నేక మయి
పొల్చుచున్నారు సంపూర్ణరాగమున;
నావంటివారి కింతటి కల్మి కల్గు
నా కలనైన వంతయె కాక? దగ్ధ
దైవమా! న న్నేల దయ మాలి యిట్లు
ధాత్రిఁ బుట్టించితో తడయక చెప్పుమ!

* * * * *

ఆ. ఇపుడు సవ్యనేత్ర మింతగా స్పందన
మందుచున్నయది, యి దెందువలన?
వాంఛితంబు దుర్లభం బని యెఱిఁగియు
సంతసింపఁజొచ్చె నంతరాత్మ. 11

ఉ. వెన్నను బొజ్జవై చికొని
వ్రేళులు నాకి ముదంబు నొందుమా
డ్కి న్నవమోహనాకృతిని
గేవలతావకపుణ్యసేవధిన్
జిన్ని యనుంగు నెచ్చెలిని
జేకుఱినప్పుడు పొందలేక గ
ర్వోన్నతిచేత, నో యెడఁద:
యుబ్బెద వేమిటి కింత మాత్రనే! 12

చ. కలుగు శుభంబు నీ కిపుడు
కాకియుఁ దూఱని యిమ్మహాటవిన్.
సిలుగులు దూరమై సుఖము
చేకుఱు; నెక్కడి మాట? లేటి సూ
వలి గిలిగింత లెన్నఁగను;
భావము యీ యడియాస మానుమా.
కలితచిరత్నరత్నమును
గాజుగఁ జెల్లదు కాని వేళలన్. 13

* * * * *

మ. ఇదె నా నెచ్చెలి వచ్చె నిక్కముగ. నిం
కేలా వితర్కించుటల్?
మృదులస్వాదువచోవిలాసముల హా
యిం జెందెదిన్ వీను, లి
వ్యదె నా మే నవశత్వ మందెడిని స్వ
ర్గామేయసౌఖ్యంబునన్;

ముద మొందించునె పద్మమున్ రవికర
మ్ముల్ గాక యన్యాంశువుల్ ? 14

క. అనుమాన మేల ? దైవం
బనుకూలం బైనయెడల, నవని నసాధ్యం
బను మాట యున్నె ? మార్గము
తనయంతం దోఁచు, నిదియె తథ్యం; బయినన్. 15

తే. ఇంత యాకస్మికముగ లభించెఁ గాన
నా సుఖంబును నిజ మని నమ్మి నేను,
వేగిరించి కందోయిని విప్పరాదు,
కడఁక మెలమెల్లఁ జూచెదఁగాక చెలిని. 16

* * * * *

ఉ. ఆరయనైతిఁ గౌతుక మ
హా! కను మూయఁగఁ; దాఁ బికోక్తి న
న్నారడనాడి, సర్వకుసు
మోత్తమవాసితదక్షిణానిలాం
కూరకరంబునన్ నిమిరి
కూర్మి వసేందిర యాదరించెడిన్
గారణహీన మైన యను
కంప జనింప హృదంతరంబునన్. 17

చ. ఉరుసుఖ మేది, పిల్చిన 'నో
హో' యనువారలు లేక, యీ భయం
కరగహనాంతరాళములఁ
గష్టము లొందెడి నాకు సత్కృతిన్

నెఱపితి; నిర్నిమిత్త మగు
నీ కృప నెన్నఁ దరంబటే? ద్విజా
దరణము నీ స్వభావము క
దా వనలక్ష్మి! సమస్తవేళలన్? 18

* * * * *

చ. జలదవిహీనవర్షగతి
సంతస మాత్మ జనించినంతనే
తెలివి యకాలమారుతము
తీరున నెట్టన దాపరించి నా
చెలి దగు పొందు శూన్యముగఁ
జేసె నయో! యిఁక నెట్లు లీ విప
జ్జలనిధి నీఁది చేరుదును
సౌఖ్యతటంబు? వచింపు దైవమా! 19

* * * * *

చ. అవయవముల్ కృశింపఁదగు
నప్పుడె కౌఁగిటఁ జేరకున్కి, క
న్గవ జలముం దొరంగనగుఁ
గాంచుటయైనను లేమి, నెచ్చెలిన్
ధ్రువముగ నించు కేనియును
ద్రోచి తొలంగని నీవు డెందమా!
యవిధిపడంగ నేటి కిటు?
లక్కట మయ్యెడి నిన్నుఁ జూడఁగన్! 20

ఉ. ఱెక్కలు కట్టుకొన్న గతి
టివ్వన నేఁగుదు వంచుఁ, గాలమా!

యెక్కడి వ్రాసెనొక్కొ? భరి
యింపఁగరాని వియోగబాధ వాఁ
డొక్క నిమేషమున్ బడసి
యుండఁడు నిక్కము; కాకయున్నచోఁ,
నిక్కరణిన్ రచించునటె
యెంతటి జ్ఞానవిహీనుఁ డేనియున్? 21
ఉ. అందని మ్రాని పండునకు
నఱ్ఱులు సాఁచితి; నెట్టు లింక నే
మందును? మోహవార్నిధిని
మగ్నత నొందెడి నామెడంద; నైఁ
పందగ దీ శరీరధృతి;
పాయని కుందు జనించె నక్కటా!
మ్రందుట యొక్కటే సులభ
మార్గము నాకు సుఖింప నియ్యెడన్. 22
తే. ఐనఁ, బూర్ణప్రయత్నంబు నాచరింప
కెపుడు కార్యవిముఖత వహింపరాదు,
వినమె 'కష్టీ ఫలీ' యని విబుధు లనఁగఁ?
గాన, నిందందు నెమకెదఁగాక చెలిని. 23
మ. కనరా దీ హరిచందనాగముల నీ
కర్పూరవారంబులన్
గన రా దీ లవలీనికుంజములఁ బు
న్నాగావనీజంబులన్
గనరా దీ సహకారబృందముల మం
దారంబులం దెందు నా

యనుఁగున్నెచ్చెలి జాడ యించుకయు; నా
హా! యేమి పాపం బొకో? 24

తే. ఇంక నేవిధిఁ జెలిని వీక్షింపఁగలుగు?
నేమి సేయుదు? బాసట యెవరు? చూడఁ
జుట్టమా, మ్రొక్క దైవమా నట్టడవిని?
వనకుజాదులె యిపుడు తోడ్పడునుగాక! 25

తే. కంటివే నాదు చెలి నశోకంబ! చెపుమ;
యేమి యీ వెఱ్ఱి? యడిగెద నేల నిన్ను?
నీ స్వకార్యమె మైనఁ దన్నినను గాని
పూయ, వన్యుల కుపకృతి సేయు దెట్లు? 26

మ. సకలానందము మత్ప్రియాస్యము భవ
త్సంవీక్షితం బేని, మా
మక దైన్యంబును దీర్చి పుణ్యమునఁ బొ
మ్మా జాజికొమ్మా! —నిర
ర్థక మీ ప్రార్థన; వృక్షజాతి మరియా
దన్ వీడి వాసంతర
క్తికిఁ బుష్పింపని జాతి, తా వికటవృ
త్తిన్ మానునే యెవ్వేడన్? 27

* * * * *

తే. అరయ కూరక యెగ్గంచు టంతె కాని,
వాయియే లేనికుజములు వలుకు టెట్లు?
వీనులే లేని యవి ప్రశ్న వినుట యెట్లు?
కన్నులే లేని యవి చెలిఁ గాంచు టెట్లు? 28

చ. కన వినఁ బల్కఁ జాలుదువు
గాన, శరణ్యము వీవ నా కిటన్;
గనికర మూని నా చెలిని
గాంచినఁ దెల్పుము చిల్కఁ తేఁడ!—ము
క్కును మొగ మెత్తఁ జేసికొని
కోపము చూపెదు, నీదు జాతి బం
ధన మొనరించుటన్ గినుక
దాల్చితె?—హా! యిఁక నేమి సేయుదున్.

* * * * *

చ. గహనమునన్ జరించెదవు,
కాంచితె యియ్యెడ మత్ప్రియాస్య మన్
తుహినకరున్? వచింపు, మిటు
తొట్రిలె దేటికిఁ? గోకిలా! శ్రవః
కుహరము లట్టె వ్రయ్యఁ గుహూ
కూజితముం బొనరించె దక్కటా!
కుహువు గ్రసించెనే హాయలు
గుల్కెడి నెచ్చెలి మోముచందురున్? 30

* * * * *

మ. అకటా! నేను విచారభారమున మూ
ర్ఛావస్థ గన్నంతనే,
ప్రకటప్రీతి యెలర్ప నెచ్చెలి యిటన్
బ్రత్యక్షమై యింద్రియ
ప్రకరంబున్ దనియించి నన్నిదె సమా
శ్వాసించెఁ దా గిట్టియున్;

ఇఁక నే నిట్టి యనుంగునెచ్చెలి ఋణం
బేరీతిఁ దీర్తున్? విధీ! 31

తే. నాయనాదృతి గాంచినంతనె విరక్తి
గాంచి వని కేఁగి చెలి త్యజియించె మేను;
అట్టి నెచ్చెలి మరణంపువార్త వినియు,
బ్రతికియుంటిని జీవచ్ఛవంబు మాడ్కి. 32

ఆ. సర్వమాన్య మైన జగము నెచ్చెలి లేమి
సర్వశూన్య మై యసహ్య మయ్యె;
నరయ నిది స్వయంకృతాపరాధఫలంబు,
దుష్టజీవితంబు దుర్భరంబు. 33

* * * * *

ఉ. హా చెలి! హా చెలీ! చెడితి,
హా! చెడితిన్ నినుఁ గోలుపోయి; నే
నే చిరయత్నలబ్ధ మగు
నీ చెలిమిన్ నిరసించినందునన్
నా చెడు టొప్పుఁ గాని, సుజ
నస్తుతిపాత్రత గన్న నీవు నా
కై చెడు టొక్కఁడే యిపుడు
కారణ మయ్యె నితాంతచింతకున్. 34

ఉ. చండకరుండు కూడ నిదె
జాలిమెయిన్, నిజరక్తదీప్తి ది
ఙ్మండలగామి గా, మృగము
ఖంబునఁ గుయ్యిడుచున్ శుగబ్ధిమ

గ్నుం డయి యస్తమించెడిని;
గుండియ వ్రయ్య దేల? తా నయః
పిండము శైలఖండము వి
వేకము చాలదు నిర్ణయింపఁగన్. 35

తే. వన్యసత్త్వార్చకుల దయవలన మృత్యు
దేవత యనుగ్రహంబు సిద్ధించునట్లు
వ్రతము గైకొని నేన తద్బలిగ నమరి
యీప్సితార్థంబు వడసెద నీ క్షణంబ. 36

* * * * *

ఉ. నా యనురక్తి గాంచమిని
నా నెలి! నీ చనినట్టి చోటికే
నీ యెడఁబాపు సైఁప కిదె
నేనును వత్తు నోకింత తాళుమా!
యీయెడ దుఃఖదూషితమ
హీస్థలిమీఁదను గాకయున్న, నిం
కాయెడ నాకలోకమున
నైక్యము నొందుద మార్తి తీఱఁగన్.37

* * * * *

ఉ. ఆఁకొనినట్టు లున్నయది
యారసి మీ రవ మాలకించినన్;
వ్యాకులపాటుచే నిపుడు
వాడెనె కాని సుభోజనాదులన్
ప్రేఁకము గన్న దీ తనువు,
వేగ మృగోత్తము! లారగింపుఁడీ;

మీ కృప నాకు నావలన
మీకు లభించు నభీప్సితార్థముల్. 38

శా. రా రేలా యిటు వేఁడినన్? మృగములా
రా! మానవాభావకాం
తారావాసముచే నెఱుంగరొకో మ
ర్త్యక్రవ్యపుం దీపి? కా
దా, రోయం గత మేమి? పావి ననియా?
తథ్యం బిదే యా;! బలా
త్కార ప్రాణవిసర్జనంబె యిచటన్
గర్తవ్య మూహింపఁగన్. 39

క. పడి చావ జలాశయమును
బడయక యురి పెట్టుకొనఁగఁ ద్రాడును లే వి
య్యెడఁ; దీవఁ ద్రాడుగాఁ గొన,
మడియుట సందిగ్ధమై శ్రమము నిక్క మగున్. 40

తే. స్థిరతరం బగు కష్టంబు దీర్చుకొనఁగ
నిపుడు తాత్కాలికశ్రమ కియ్యకొంటి;
ముల్లు పుచ్చఁ గొ ఱ్ఱడిచికో మొనయు పగిది
దీర్ఘ మరణయాతన కెట్లు దివుర నేర్తు? 41

మ. బహుళైశ్వర్యనిధాన మై సకలసౌ
భాగ్యంబులన్ బొల్చు స
న్మహితక్షత్రకుటుంబమందు జనియిం
పంగన్న నే నిప్డు ని
స్పృహతన్ జావఁగడంగ నింత విషమున్
జేకూఱ దీ చోట నా;

కహాహా! యిట్టివ కావె స్వస్థలబల
వ్యస్తప్రయత్నావధుల్ ? 42

ఆ. దిక్కు లేని నాకు దేవతలే దిక్కు;
పావకుండు సర్వభక్షకుండు
గాన నా కుపాస్యుఁడై నా శరీరమ్ము
భేదబుద్ధి లేక స్వీకరించు. 43

శా. నేనున్ నాచెలియున్, బరస్పరము ని
ర్నిద్రానురాగంబు సం
ధానం బైనను బొందలేక యిట స
ద్దాంపత్యధర్మం, బన
న్యానీతాత్మలమై దివిన్ గలసికో
నర్థింతుమేనిన్, జిరా
నూనార్తిన్ జెలి చన్న చోటి కిదె న
న్నున్ జేర్పుమా దైవమా! 44

శా. ఆహా! యెంతటి భాగ్య! మించుక తనున్
బ్రార్థించినంతన్ గృపా
సౌహార్దంబు లెలర్పఁగా సుముఖుఁడై
సాక్షాత్కృతుం డైన యా
స్వాహావల్లభు మూర్తిపోలె నొక దీ
పం బల్లదే కానన్నై
బాహాటంబుగఁ దెల్పఁజొచ్చెఁ దరణో
పాయంబు నా కీయెడన్. 45

తే. చితయుఁ జింతయుఁ జీవిఁ గాల్చెడివె యైన,
బ్రతికినన్నాళ్లు దహియించి బాధపెట్టు

చింతఁ బాప సమర్థంబు చితయె గాన,
నదియె శరణంబు నా చింత నపనయింప. 46

శా. వాపోవంగ నిఁకేల మిన్నక? పరబ్రహ్మాత్మకం బైన యా
దీపజ్యోతి సమాశ్రయించి, చితిసందీప్తంబుఁ గావించి, సం
తాపధ్వాంతము సంహరించి, యమితానందంబు సంధిల్లఁగా
నా పూర్వార్జితపుణ్యరాశిఁ జెలి సందర్శింతు నొక్కుమ్మడిన్.

* * * * *

ఆ. వనరుహాస్త్ర! యిపుడు వానముందరి యుక్క
పోలె నను దహింపఁ బూని తేల?
యే ననంగతను వహించిన, నీ గతి
యేమి యగునో చూడు మింకమీఁద. 48

* * * * *

క. నా నడచు కోలఁది మార్గము
తానున్ నడచెడినె? యొకటె దవ్వున నెపుడున్
గానంబడియెడి దీపము;
దీనిన్ దరియుట యిఁకెట్లు దీనత దీఱన్? 49

చ. తడఁబడఁజొచ్చెఁ బాదములు,
దప్పి జనించెఁ, గృశించియున్న యీ
యొడలు బలంబు లేక శ్రమ
కోర్వకయున్నది, యెంత మాత్రమున్
నడవఁగజాల; నింక శర
ణం బెది? యీదృశకష్టవేళలన్
గడుకొని వేఁడ, జాలిపడి
కావని దైవము నే మనందగున్? 50

తే. అనుఁగునెచ్చెలి! నా పొత్తు నభిలషించి
కాదె దురవస్థ పడితి వీ కానయందు?
నీ వయిన నన్నుఁ గొనిపోవ రావ దేమి?
స్వప్నతం గన్నుఁ, బ్రేముడి సన్నగిలునె? 51

* * * * *

ఉ. చారుహరిత్తృణావృతవి
శాలతటాంచలమున్ బ్రసన్నవాః
పూరము నా తటాకమునఁ
బొల్పగు శైవలయుక్తపుల్లక
హ్లారము రీతి వల్కలము
లన్ దన మేన ధరించి యీరవున్
ద్వారమునన్ జెలంగెడి నె
వండొ మనోహరమూర్తి యెంతయున్!

తే. చావనున్నట్టి నా కేల జీవితాశ
మరలఁ గలుగుచున్నది? మనుజశూన్య
మైన యడవిలోఁ గష్టమధ్యంబునందు
మనుజదర్శనమున మతి మాఱు టరుదె ? 53

శా. నా సంప్రార్థన మాలకించి కడఁకన్
దాక్షిణ్య మేపారఁగాఁ
దా సందర్శన మిచ్చి తత్క్షణమ యే
తద్దివ్యనవ్యాకృతిన్,
నా సంత్రాసము దీఱ దీపముకడన్
నన్ జేర్పఁగాఁ జూచెడిన్

నా సమ్యగ్గుణరాశి నెచ్చెలి; భళీ!
నా భాగ్యమింకే మనన్? 54

* * * * *

తే. "ఓ దయామయ! జడదారి! యో మహాత్మ!
తనదు స్నేహప్రధానత దనరునట్లు
పాంథజనమార్గదర్శియై వఱలుచున్న
యా ప్రదీపికదరిఁ జేర్పుమయ్య నన్ను! 55
మత్త. దారి తప్పితి, నొంటిఁ జిక్కితి దారుణాటవిలోపలన్;
ఘోరపాపఫలంబుగా నిటు కుందనయ్యొ మహాత్మ! న
న్నేరహీన్ గరుణించెదో? వచియించితిన్ నిజవృత్తమున్,
నేర మెన్నకుమయ్య మ్రొక్కెద, నీవె నాకిఁక దిక్కటన్,"
మ. అని నిట్టూర్పు నిగుడ్చుచున్ నిఖలదై
న్యం బాకృతిన్ దాల్చెనో
యన నిల్చుండిన బాటసారిఁ గని య
వ్యాజానుకంపామతిన్,
ఘనుఁ డత్తాపసవర్యుఁ డిట్లను మహా
గాంభీర్య మింపొంద నం
దనమందారమరందబిందువిలస
న్మాధుర్యధుర్యోక్తులన్: 57
చ. "తన యుసుఱుల్ గొనంగ నఱు
తన్ మృగయుం డొనరించు గానమున్
విని యనుమాన మొందక త
నిన్ వడిఁ జేరెడి లేడి కైవడిన్,

దనకలి యైన యా కొఱవి
దయ్యము చేసెడి మోసమున్ నిజం
బనుకొని దాని డాయఁగఁ బ్ర
యత్న మొనర్చుచునుంటె? బాలకా! 58

తే. దారి తప్పించి యద్భుతార్థములు చూపి
లేనిపోని యాసలు గొల్పి కాని చోట్లఁ
ద్రిప్పిత్రిప్పి పాంథులను బాధించుచుండు
కొఱవిదయ్యాల కథలు నీ వెఱుఁగవొక్కొ?'' 59

త. అనెడి లోపల భగ్నయత్నత నైన చింతనొ భీతిచే
తనొ పథిశ్రమచేతనో భవితవ్యనిస్స్పృహనో మఱెం
దుననొ దాఁచిన దాఁగ కశ్రులఁ దోఁగు తెర్వరియాస్య మొ
య్యన వ్యథాతిశయంబుఁ దెల్పఁగ, నత్తపోధనుఁ డిట్లనున్:

తే. ''కొఱవిదయ్యపు మోసంపుటురులఁ బడియు
నీవు తప్పించుకొంటివి దైవికముగ;
సంతసించుట కియ్యది సమయము కద,
యీవిధంబుగ దురపిల్లె దేటి కింక? 61

శా. భీతిన్ జెందకుమయ్య నేఁ గలను; సం
ప్రీతిన్ సమర్పించు నా
యాతిథ్యంబు పరిగ్రహించి, యిట మా
ర్గాయాసముం దీర్చుకొ;
మ్మేతన్మంజునికుంజమందు, విను తా
మే వేళ కేతెంచినన్,
జేతఃపూర్వక మైన స్వాగతము సం
సిద్ధంబు పాంథాళికిన్. 62

తే. జోగి యేమి విం దే మని చూడవలదు;
వంటకంబు లొకండె లోపంబు కాని,
వనరమాదేవి హృదయపూర్వకము గాఁగఁ
జేయఁగల విందు నీ కిందు సిద్ధ మిపుడు. 63

మత్త. పండి తేనియ లొల్కు మెత్తని పైఁడిగిండ్లను బోలుబల్
కొండపండ్లను వెండితుంపర గుం పనన్ గడు స్వచ్ఛమై
నిండి పర్వెడి యేటి తీయని నీరమున్ గయికొమ్మిటన్
బండువెన్నెల బైటఁ దేఁటుల పాట లింపు ఘటింపఁగన్.

తే. 'ఆత్మవ త్సర్వభూతాని' యని యెఱింగి
మహి నహింసయె పరమధర్మముగ నమ్మి
వ్రతముగాఁ గొంటి శాకైకభక్షణంబు;
వేఁటరులును నాయున్కి రా వెఱతు రిటకు. 65

మ. పరమాత్ముం డగు దేవదేవునకు స
 ర్వప్రాణులున్ దుల్యముల్;
కరుణాదృష్టి నినున్ ననున్ సకలమున్
 గాపాడు నాతండె; సా
దరబుద్ధిన్ విడనాడి కృత్రిమసమ
 ర్థత్వాప్తి గర్వించి, సో
దరజంతుప్రతతిన్ భుజించు టదియున్
 ధర్మంబె మర్త్యాళికిన్? 66

తే. స్థావరప్రాణిహానియు సైఁపలేక
మొదలె వదలివైచితిఁ గందమూలములను;
బత్త్రఫలపుష్పములఁ గూడ వలయునంత
కధికముగఁ గోయుటకుఁ జేతు లాడ వెపుడు. 67

శా. నాకే చోద్యముగా స్ఫురించె; విను మీ
నాఁ డెవ్వ రభ్యాగతుల్
లేకున్నన్, మఱి మాలి నీకొఱకె పో
లెన్, దెచ్చితిన్ యోగ్యమౌ
శాకాదుల్ ద్విగుణంబు గాఁగ; భగవ
త్సంకల్ప మం చెంతు నీ
రాకన్ బాలక! మాఱువల్కక సప
ర్యన్ గొమ్ము సంప్రీతిమై. 68

తే. ఐహికార్థంబు లెల్లఁ బ్రార్థ్యములు గావు,
ప్రార్థ్యములును జిరానుభోగ్యములు గావు;
వానిఁ గూర్చిన చింతలఁ బాయు టొండె
యిహపరసుఖంబులకు మార్గ మెంచి చూడ. 69

మత్త. ఈ సమీహితధర్మమున్ మది నెంచి నీదువిచారమున్
ద్రోసిపుచ్చి క్షుధార్తి వోవ నెదో యొకింత భుజించి వి
శ్వాసబుద్ధిని దీవనల్ గొని వైళ మియ్యెడ నేఁటికిన్
గాసి తీఱఁగ నిద్రపొమ్ము సుఖమ్ము గాంచెద వెంతయున్.”

ఉ. శారదపూర్ణచంద్రుని ప్ర
శస్తసుధాకిరణంబు లట్లు చె
న్నారెడి మౌని వాక్యముల
స్వాంత మొకించుక శాంతవృత్తి నొ
ప్పారఁగ, బాటసారి విన
యైకపురస్కృత మౌ విధేయతన్
సారెకుఁ జూపఁజొచ్చె ముని
సత్తముఁ డెంతయు సంతసింపఁగన్. 71

తే. అర్ఘ్యపాద్యపానీయభక్ష్యము లమర్చి
తపసి వెన్వెంటఁ దిరుగుచుఁ దాను గూడఁ
దెరువరికి సపర్య యొనర్చు తీరు చూపె
లీల విలసిల్లఁ బెంపుడు లేడిపిల్ల. 72

ఉ. ఎట్టెటొ కూరుచున్న, మతి
కింపు ఘటింపవు బాటసారికిన్
గట్టెదుటన్ గనంబడెడి
కమ్రకురంగకుమారి యాటలున్
బిట్టలు తుమ్మెదల్ గలసి
వేడ్కమెయిన్ వినిపించు పాటలున్
దట్టపు జ్యోత్స్న తేటలును
ధైర్యము గొల్పెడి మౌని మాటలున్. 73

మం. జడదారి యానతి జవదాఁటలేక
బాటసారి ఫలంబు పట్ట నుంకింపఁ
జే యాడ దింతయుఁ; జేయి యాడినను
నో రది గైకోదు; నోరు గైకొన్న
జిహ్వ వెలికిఁ ద్రోయు; జిహ్వ లోఁగొన్నఁ
గంఠంబు మ్రింగదు; కడకు మ్రింగినను
గడుపుచిచ్చారు; దాఁకటి చిచ్చు నార్చు
నాహార మెట్లు శోకాగ్ని నడంచు? 74

చ. పొరలెడి దుఃఖవారినిధి
పోటునకున్ బఱతెంచు బాష్పపుం
దరఁగలు సంకులంబు లయి
తద్దయుఁ బర్వఁగ, నూర్పుగాడ్పు లు

ధురగతి వీవఁ, దెర్వరి న
ధోగతిఁ ద్రోయుచు రోదనధ్వనుల్
దొరకొనఁ, దన్మన స్తరణి
తొట్రిలు రీతి గరంప దెవ్వరిన్? 75

తే. ఒడలు వేఱైన జీవ మొక్కఁడె యటంచు
సానుభూతి రూపెత్తిన సరణి దోఁపఁ,
దాను విలపించునంతటి దయ వహించి
తపసి యిట్లను నాతురత్వము చెలంగ: 7

ఉ. "క్రోసెఁడు దూర మిచ్చటికిఁ,
గోట యొకం డతిజీర్ణమై పురా
ణాసమువై భవంబు దన
రారఁ జతుష్పథమందు భిక్షుకా
వాసముగా నెసంగెడిఁ; బ్ర
భాతమునన్ నినుఁ జేర్తు నయ్యెడన్;
వేసరఁబోకు, మార్గము ల
భించును నీ కట స్వస్థలాప్తికిన్. 77

తే. ఎంత చెప్పిన వినక నీ వీతెఱఁగున
వెక్కివెక్కి యేడ్చెద వేల వెఱ్ఱి వోలె?
దుఃఖహేతువు గోప్యమో, దుఃఖభరము
మాట రానీదొ, యేటి కీ మౌనముద్ర?" 78

మ. మునివాక్యమ్ములు ముల్కులై నిజమన
మ్మున్ నాటి వాగ్రక్తబిం
దునికాయమ్మును గద్గదస్వరముఖో
ద్భూతంబుఁ గావింపఁగాఁ,

దన హృత్తాపము బాటసారి యిటు ప్ర
స్తావించె, నిర్విణ్ణ యై
వనలక్ష్మీసతియున్ మరందమయబా
ష్పశ్రేణి వర్షింపఁగన్: 79

తే. "జీవితాశయె లేని నా కీవిధముగ
నింటి తగులంబు కల్పించె దేటికయ్య?
జాలి గలదేని,, జా గేల? సంయమీంద్ర!
నాకమార్గంబు చూపి పుణ్యమునఁ బొమ్ము." 80

ఉ. చేతము లేని కాననమె
చేడ్పడి యశ్రులు రాల్చె నన్నచో,
భూతదయావతారుఁ డయి
పొల్చెడి యమ్మునిసానుభూతికిన్
గాతరవృత్తికిన్ మితము
కల్గునె? తెర్వరి కెట్టులేని సం
ప్రీతి ఘటింపఁబూని కల
రీతి కనుంగొన నాతఁ డిట్లనున్: 81

తే. "మంజులము లైన నీ పాదకంజములకుఁ
గువలయాధీశకోటీరకోటిరత్న
ఘృణుల రక్తిమ గూర్ప యత్నింప కకట!
కంటకోపలములచేతఁ గడచు టేల? 82

శా. ఏ రాజర్షి కులంబు ధన్యతమ మ
య్యెన్ దానకావాప్తిచే?
నే రాష్ట్రప్రజ కుందుచుందురు త్వదీ
యైతద్వియోగంబునై?

నే రమ్యాక్షరపాళి పుణ్యమును గా
వించెన్ భవన్నామమై
తా రంజిల్ల? నెఱుంగఁ బల్కఁగదవే
తారుణ్యసంపన్నిధీ! 83

ఉ. ఈ మెలప్రాయమం దకట!
యింత విరక్తి వహించి తేటిక
య్యా? యిది పాడియే? పితల
యాగ్రహమా, యరివర్గదౌష్ట్యమా
నీ యిలు నాసి యీకరణి
నెవ్వగ లొందుటకున్ గతంబు? కా
దా, యిఁక నేమి కారణము?
ధర్మము తప్పిరె మిత్రనామకుల్? 84

తే. మైత్రి యనురాగ మివి రెండు మహిని లేవు,
అవి ధనముతోడి నీడలై యానగొలుపు;
ఒక్కకెడ మైత్రి యుండిన నుండుఁగాని,
నిర్మలానురాగం బది నిండు సున్న. 85

క. అనురాగజాడ్యదోషము
వనితలకే, యందు విత్తవతులకు నధికం
బని తెలిసియు వలవంతల
వనరెడి పూరుషులు వెఱ్ఱివారలు గారే? 86

చ. ఒక క్షణ మున్న చిత్తము మ
రొక్క క్షణంబున కెల్ల మాఱెడిన్,
త్రికరణశుద్ధి సున్న, మృగ
తృష్ణలఁ బోలు విలాసవైఖరుల్,

ప్రకటము సాహసంబు, మఱి
స్పర్థకు మేరయె లే — ద దేలొకో
సకల మెఱింగియున్ బురుష
జాతి నెలంతలకై తపించెడిన్ ? 87

తే. అరయ విత్తవంతులకె లభ్యములు భవన
వాసమును జాయసౌఖ్యంబుఁ బౌరుషాక
రత్వము ననంగ వినలేదె? రాకొమార !
ధనము లేకున్న ముఖవర్ణమును వొలంగు. 88

ఉ.-ఈ యిహలోకసౌఖ్యములు
హీనములున్ క్షణభంగురంబులున్
బాయని కష్టహేతువులుఁ
బాపమయంబులు; వీనికై సదా
హేయధనాధిదేవత భ
జించెడివారికిఁ బారమార్థిక
శ్రీ యెటు లభ్య మయ్యెడిని ?
చిత్తమునన్ దలపోసి చూడుమా ! 89

* * * * *

ఆ. గాఢతప్తలోహగతసుశీతలవారి
పొగల సెగలఁ బఱపు పగిది దోఁప
మాని వాగమృతము మఱఁగు తెర్వారినుండి
కోపనిష్ఠురతలఁ గుమ్మరించె: 90

శా. "మీ రెవ్వారలు, చంద్రవర్మవలె గం
భీరార్థముల్ వల్కుచు

న్నారల్? భగ్నమనోరథుల్ సయితము
న్యాయంబుగా నీగతిన్
నారీలోకము నెల్ల దూఱెదరె? కాం
తల్ సేయు నేరంబులన్
ధీరోదాత్తులు దిద్దఁబూనక విర
క్తిన్ బూను ట్లౌచిత్యమే?

* * * * *

తే. చంద్రవర్మను మృతుని నిష్కారణముగ
నిపుడు పేర్కొని తెగడితి — నేమి సేతు?
చేడె యెవతెయొ యతని వంచించెఁ గాని
సుగుణి యతఁడు దూషింపఁ డా సుదతి నైన! 92

మ. కలఁకంబాఱిన చిత్తము త్తలపడన్
గన్నీరు మున్నీరుగా
విలపింపం దలకొన్న తెర్వరిని సం
వీక్షించి యాత్మీయ మా
నలఘూద్రేకము నాఁచికొం చతిగభీ
రాలాపముల్ మీఱ ని
స్తుల తేజస్వి తపస్వి యి ట్లనియె దృ
ష్టుల్ తుష్టి నొప్పారఁగన్: 93

తే. "పాపము శమించుఁగావుత, బాలచంద్ర!
చంద్రవర్మ యా చెలినె లక్ష్యముగఁ బూని
యుగ్రతపమును గావించుచున్నవాఁడు,
దివ్యదృష్టిని గనుఁగొంటి దిగు లిఁ కేల?" 94

ఉ. పారము లేని శోకపుఁ బ్ర
వాహమునన్ బడి కొట్టుకొంచు నే
దారియుఁ గానరాక కడు
దైన్యము నొందెడి బాటసారికిన్
ధీరమునీంద్రు వాక్యములు
తెప్పగఁ దోఁచిన, స్త్రీజనైకసా
ధారణ మైన లజ్జ బహు
ధా ప్రతిబంధక మయ్యె నయ్యెడన్. 95

సీ. సాంద్రరాగవ్యాజసాంధ్యారుణద్యుతుల్
గండభాగముల పైఁ దాండవింప,
మంజుముఖేందుమండ మందాక్షమేఘవి
కలసరస్మితచంద్రికలను బఱపఁ,
గమనీయపీనవక్షము నిర్భరానంద
బాష్పాప్తిఁ బులకలువాఱి యుబుకఁ,
దనుయష్టి మించి యధరపల్లవంబు శ్వా
సానిలాహతిఁ జేసి యల్లలాడఁ,
జెదరి యదరెడి గుండియ చిక్కఁబట్టి,
మౌని పదముల కట్టె నమస్కరించి,
యొక్క మొగి దైన్యభయభక్తు లుట్టిపడఁగ
నెట్టకేలకుఁ దెర్వారి యిట్టు లనియె: 96

మ. "నను మన్నింపుఁ డటంచు వేఁడు టెటులో?
నమ్మించి వంచించి యా
యనఘస్వాంతునిఁ జంద్రవర్మను విచా
రాబ్ధిన్ బడం ద్రోసితిన్;

దనివిన్ జెందక యంతటన్, గడుఁ బవి
త్రం బైన నీ యాశ్రమం
బును నిన్నున్ మలినీకరించితి ని టీ
మోసంపు వేసంబునన్. 97

క. రక్షింపను శిక్షింపను
దక్షుండవు దక్షిణుఁడవు; దయనీయను నన్
సాక్షాత్పశ్చాత్తప్తను
వీక్షింపవె కరుణరససమృద్ధి దలిర్పన్." 98

తే. అనుచుఁ దెర్వరి పరితాప మతిశయింపఁ
బురుష వేషంబు నెడలించి పొలిచె నపుడు
మేఘనిర్ముక్తమై మించు మించు వోలె
వఱలి మునివర్యు నిష్టదేవత యనంగ. 99

మ. కనులున్ వీనులు నేక కాలమున న
క్కాంతామణిన్ గాంచుచున్
వినుచున్ దన్మయతన్ భజించుటను ని
ర్విణ్ణుండుగా నున్న య
మ్ముని, స్వాంతంబు వధూవచోవిరతి సం
బుద్ధంబు కాఁజొచ్చినం
తనె, తద్వాగమృతార్థి యై మరలఁ బ్రో
త్సాహంబుగా నిట్లనున్: 100

తే. "ఎవరిని క్షమింపు మని కోరె దిందువదన!
కోపగించిననే కదా కోరవలయు;
సర్వసంగపరిత్యాగసరణి గనిన
వాఁడ నే నేఁడు? గోపతాపంబు లేద?" 101

ఆ. దుఃఖకారణంబుతోఁ బాటు భయకార
ణముఁ దొలంగెఁ గాన నాతిమిన్న
కొంత దిటవు పూని కోరిక లీరిక
లెత్త వినయ మొనయ నిట్టు లనియె : 102

ఉ. "పావనమూర్తి, నావలని
పాపము లెల్ల నశించె నొక్కటన్
దావకదర్శనైకఫలి
తమ్ముగ; నమ్మృతవిశ్రుతుండు మ
జ్జీవవిభుండు నాకొఱకె
తీవ్రతపం బొనరించుచుండుటల్
నే వినఁగల్గితిన్ — గలుగు
నే మఱి యింతకు మించు భాగ్యముల్?

మ. అయినన్, నా దొక ప్రార్థనంబు కలద
య్యా మౌనివర్యా! త్వదా
శ్రయలాభంబునఁ బొందరా దెది? తప
శ్శక్తిప్రయోగంబునన్
నయనానందముగా ఘటింపుము మనో
నాథానుసంధానమున్
దయితుండున్ క్షమియించినన్ గద కృతా
ర్థత్వంబు సిద్ధించుటల్!" 104

తే. ఆలకించిన కొలఁది మిన్నందునట్టు
లతిశయించెడి సంతోష మణఁచికొనుచు
రాట్కుమారికారాగదార్ఢ్యం బెఱుంగఁ
గోరి యిట్లనె నమ్మునికుంజరుండు : 105

తరు. "వలపించి వంచించి వలవంత ముంచి
వరుని మహాఘోరవనవాసిఁ జేసి
పలుబాములను బెట్టఁ బాల్పడినట్టి
వధువు నేవిధి నమ్మవచ్చునో చెపుమ!
చలచిత్త మొకటఁ బశ్చాత్తప్తమైన,
శాశ్వతం బని యెన్నఁజన్నె మా సరణి?
కలికీ! రసాభాసకష్టదాంపత్య
ఘటనాఘమున కొడిగట్టె నే నోప." 106
కవి. అనియెడిలోపల న త్తరుణీమణి
'హా! హత నైతి' నటంచు లస
త్తనులత యూఁత తొలంగిన రీతిని
ధాగుణో వ్రాలఁగ మూర్ఛిలె; న
మ్మునివరుఁడున్ దన మూర్ఖత కెంతయుఁ
బొక్కుచు విహ్వలతన్ గనియున్
గొన కుపచార మొనర్పఁ దొడంగెను
గోమలికిన్ గడు నాతురతన్. 107
ఉ. అంతకుముందుఁదా నెఱుఁగనట్టి తెఱంగునస్పర్శసౌఖ్యరమిం
తం తనరానిమైమఱపు నట్టె ఘటింపఁగ మానినయ్యెఁ దా
యింతిని సేదదేర్చుపని నేమఱి తన్మయతన్ భజించియున్,
గాంతనుమూర్ఛయిక్కరణి గాసిలఁజొచ్చెవిచారమేర్పడన్ :
ఆ. "హా! వసంతసేన! హా. కురంగేశ్వర
పురవరాధినాథవరతనూజ!
హా! మనోహరా! మదర్థమై యీగతి
గాంచినావె నాదు కనుల యెదుట? 109

మ. చిననాఁడే తలిదండ్రులన్ ఫణిపురీ
సింహాసనాధీశతన్
గోనకున్ దాదిని గూడఁ గోల్పడి మహా
క్షోభంబు సైరింపఁ జా
లిన నా చిత్తమ దేలొకో యిపుడు జా
లిన్ గుందు నీపాటు తాఁ
గనినంతన్ మిత్రి మీఁటె; నీ వెఱుఁగవే
కాంతా! తదాంతర్యమున్? 110

క. నీవే నేనో నేనే
నీవో కావలయు నిదియ నిజ; మీ యవినా
భావానుబంధ మెఱుఁగమి
నీవిధముగ విరహదుఃఖ మేర్పడె మనకున్. 111

శా. ఆశాభంగసమాత్తశోకము నరణ్యావాసఖేదంబుఁ దా
లేశంబేని గణింపకున్న హృది త్వల్లీలావిలాసైకసం
కాశచ్ఛన్నగుణానురాగము లెఱుంగన్లేక నీ కీఁగతిన్
గ్లేశమ్మున్ ఘటియించినందునకుఁ గన్నీర్నించెడిం గాంచితే?

ఉ. ఏ కడకంటిచూపు లభి
యించునొ ధన్యతగాఁ దపస్వినై
శాకలముల్ భుజించుచు మ
హాశ్రమ మెల్ల సహించినాఁడనో.
ప్రాకట మైన నీ కృపకుఁ
బాత్రుఁడ నైన యనంతరంబు నా
కా కడకంటిచూపు కఱ
వయ్యె; నయో! యిఁక నేమి సేయుదున్?"

మ. అని మార్కాట వినంగరామి నతఁడా
హాకారముల్ సేయుచున్
దను లేవందివియం బ్రయత్నపడ, న
త్తన్వంగి లోలాక్షులన్
దన లజ్జావనతాస్యమండలము సౌం
దర్యంబు గుప్పింపఁ జి
వ్వన మేల్కాంచినయట్లు లేచి తొలఁగెన్
బూఁదీవలన్ దీవమై. 114

తే. కనుమఱుం గన్యనో లేదొ కలికిమిన్న,
కమలపత్రగతోదకకణములట్లు
తత్తఱించి చిత్తంబు లుత్తలపడంగ,
నుభయు లుత్కంఠఁ గనిరి యొండొరుల మీఁటి. 115

చ. వరకరపల్లవంబులకు స్పర్శహిమార్ద్రిపటీరచర్చకున్
సరసనరాగసాంత్వనవచస్సుధ కంకసరోజశయ్యకున్
గర మలవడ్డవారలకుఁ గల్గువియోగము దుస్సహంబితః
పరశిశిరోపచారములు భావభవాగ్ని నణంపఁజాలమిన్.

చ. తరతర మప్రయత్నముగ
దగ్గఱఁ జేరి వధూవరుల్, పర
స్పరవిరహాసహిష్ణుతను
వ్యక్తము సేసెడి దీనవాక్యముల్
స్మరనిగమోక్తమంత్రములు
సంస్మృతిభావము సంఘటింపఁగాఁ,
బరిణయసంస్కృతిన్ గనిరి
బాహులు మంగళసూత్రమై తగన్. 117

ఉ. మంగళమూర్తులిద్వరును, మానసికైక్యముతోఁ బరస్పరా
లింగనకారణంబున ఫలించిన యేకతనుత్వమందు వ్యా
సంగము గాంచి కంఠములు సర్వవిధంబుల మేళవింపు శ్రీ
వింగన, దేవదేవు నిటు వేఁడిరి సుస్థిర సౌఖ్యకాము లై: 118

తే. "ఈ భవంబుననే కాక యింకమీఁద
నెత్తనున్న భవంబులం దెల్ల మమ్ము
నిరతనిర్మలరాగాంబునిధినిమగ్న
దంపతులఁ జేయు మీశ్వరా! దయ దలిర్ప." 119

చ. శుకపికశారికాదుల వి
శుద్ధరవంబులు మేళగించి మే
లుకొలుపఁజొచ్చె లోకమును
లోఁగొని, సాత్త్వికభావమాధురీ
ప్రకటతదీయగీతరస
బంధురుఁడై యల దేవదేవుఁడున్
బ్రకృతిముఖంబునన్ గలసి
పాడఁదొడంగినచాడ్పు దోఁపఁగన్. 120

తేటగీతి

శ్రీభరద్వాజగోత్రవర్ధిష్ణు
కాళ్లకూరి రాజయామాత్య కుమార
వి బు ధ వి హి త
గోపాలరాయకవి ప్రణీత మగు
వసంతసేనాఖ్యకావ్యంబు
ముగిసె

శ్రీ ర స్తు

# వసంతసేన

## లఘుటీక

అవతారిక 1. పద్యము:—స్త్రీపురుషవ్యవస్థ = స్త్రీ), పురుషుఁడు అని యెడియేర్పాటు, కల, సృష్టి = (ప్రపంచ) నిర్మాణము, నిజ... పరిణామమై- నిజ = తనయొక్క, సత్ = సత్య(త్వ)ము (నిజమైన యునికి) యొక్కయు, చిత్ = జ్ఞానముయొక్కయు, ఆత్మక = రూపము గలది యగు, శ్రీ = శోభ యొక్క, పరిణామము ఐ = మాఱురూపము గలదియై, తగన్ = ఒప్పుచుండఁగా, శక్తిసమేతుఁడు = శక్తి (యను దేవి)తోఁ గూడినవాఁడు (సమర్థతతోఁ గూడుకొన్నవాఁడనియు), ఆ పరమస్వరూపము = ఉత్కృష్టమైన యా (స్త్రీపురుషభేదము గల మాఱు) రూపము, సమగ్రముగాఁగన్ = సంపూర్ణమైన దగునట్లు, అఖండరాగలీలాపరిపూర్ణమోదమున్ = అవిచ్ఛిన్నమైన (అశేషమైన) యనురాగవిలాసములతో నిండిన యానందమును, లాలితరీతిన్ = ఒప్పైన విధముచేత, గృహస్థకోటికిన్ = గేస్తుల సమూహమునకు, ఎసఁగఁజేయుతన్ = అతిశయింపఁజేయునుగాక.

సృష్టి స్త్రీపురుషనియమము గలది. ఈశ్వరుఁడు సచ్చిద్రూపుఁడు; మఱియు శక్తిసమేతుఁడు. దానంజేసి యీశ్వరుని "సత్తు, చిత్తు" అనునవి రెండును స్త్రీపురుషనియమము గల సృష్టియై పరిణమించుచున్నవని భావము. మఱియు, శక్తిసమేతుఁడనుటచే నయ్యీశ్వరునిలీల పురుషసృష్టిగాను, శక్తియొక్కలీల స్త్రీసృష్టిగాను బరిణమించుచున్నదనియు గ్రహింపవచ్చును. అట్టిపరమాత్మ తనదగు నేర్పాటు నిండారిన దగునట్లు, అనఁగా సచ్చిదానందత్వము సమగ్రమగునట్లు తనయొక్కయు, శక్తియొక్కయు

లీలలవలన జనించి భార్యభర్తయను వ్యవస్థతో గృహస్థులైయున్నవారికిఁ (మిథునములకు) దెంపులేని యనురాగవిలాసములతో నిండిన యానందము నతిశయింపఁజేయునుగాకయని యాశీర్వచనగర్భిత మగుప్రార్థనము. ఉత్పలమాలావృత్తము.

ఏతత్పద్యార్థము కొంచెము క్లిష్ట మగుటంజేసి తంజనగరము దేవరాజసుధి గారి టీక కూడ నిందుఁ జేర్పఁబడినది.

సృష్టి భగవత్స్వరూప మనెడి వైదికసిద్ధాంతము నాశ్రయించి కవి యిట వర్ణనాపరికరము సమకట్టుకొనుట తెలియునది. ఈశ్వరుని ప్రకృతిస్వరూపము సత్ + చిత్ -మయము. అతని వికృతి యగు సృష్టి స్త్రీ + పురుష-మయము. అతఁడు సత్ + చిత్ + ఆనంద స్వరూపుఁడు గావున అతని ప్రకృతియందలి సత్ + చిత్తులకు ఆనందమును గూడిననే యతని స్వరూపము సమగ్ర మగునట్లు అతని వికృతియందలి స్త్రీ + పురుషులకు ఆనంద విశేష మగు రాగలీలామోదము గూడిననే అనఁగా నతఁడు గూర్చిననే అది సమగ్ర మగు నని చమత్కరించుట భావ్యము.

స్త్రీపురుష వ్యవస్థ = స్త్రీలు పురుషులు అనెడి యేర్పాటు, గల సృష్టి, నిజ సత్ చిత్ ఆత్మక శ్రీ పరిణామ మై = తనయొక్క సత్తు చిత్తు అనునవి స్వరూపముగాఁ గల పెంపుయొక్క వికారమై అనఁగా తన సచ్చిత్తుల వికారమై, తగన్ = ఒప్పఁగా, శక్తిసమేతుఁడు = శక్తితోఁ గూడుకొన్నవాఁడు (అగు) ఈశ్వరుఁడు, అపరమస్వరూపము = ఉత్కృష్టమైన ఆ స్త్రీపురుషాత్మక (వికృతి) స్వరూపము సమగ్రముగాఁగన్ = నిండినది యగునట్లుగా, అనఁగా ప్రకృతియందలి సత్ చిత్తులు, ఆనందముతోఁ గూడి సమగ్రమైనట్లు వికృతియందలి స్త్రీపురుషులు రాగలీలామోదముతోఁ గూడి సమగ్రమగునట్లుగా గృహస్థకోటికిన్ = గృహస్థుల సమూహమునకు, లాలితరీతిన్ = ఒప్పిదమగు విధమున, అఖండరాగ లీలా పరిపూర్ణ మోదము = అవిచ్ఛిన్నమైన యనురాగవిలాసమువలని మిక్కిలి నిండారిన సంతోషమును, ఎసఁగఁజేయుతన్ = అతిశయింపఁజేయునుగాక.

స్త్రీ పురుషాత్మక మగు గృహస్థకోటికినఖండ మగు దాంపత్యసుఖవిభవము గూర్చుఁగాత మని యాశయము. శక్తిశబ్దమందలి స్త్రీలింగ సారస్యముచే స్త్రీసాంగత్యము గల (అనఁగా దాంపత్యరసాభిజ్ఞుఁ డగు) ఈశ్వరుఁడు దంపతులకు మోదము గూర్చుటకుఁ జాలు నని యానుగుణ్యము సూచితము. ఈశ్వరుఁ డనుటచే సర్వనియమనాధికారి గావున అఖండసమ్మోదము ఘటింపఁజాలు ననుట వ్యంజితము.

2. ప:-ఆదిగన్ = మొదలుగా, భూతలశయనంబు= నేలపైఁ బరుండుట, ఏకభుక్తి=ఒక్కపూఁట భుజించుట, వ్రతముల్ =నియమములు, తలంచుడున్ =తలఁపఁగా (జ్ఞప్తికి వచ్చుటచేత నని భావము.) ఏతత్ ప్రణయకృతిరచనకున్-ఏతత్ = ఈ, ప్రణయకృతి = ప్రేమయే ప్రధానముగాఁగల గ్రంథముయొక్క, రచనకున్ = చేఁతకు, ఇచ్ఛ జనించెన్ = కోరిక పుట్టెను (బుద్ధి పొడమె నని భావము).

నా (కవి) తల్లి గారు మృతినొందఁగానే (తద్వియోగదుఃఖముచే) తండ్రి గారు నేలపైఁ బడకయు, దినమున కొక పూఁట భుక్తియు, ననువ్రతములతో జీవయాత్ర ముగించి రను విషయము జ్ఞప్తికిరాఁగా ప్రేమమయ మగు నీకావ్యము రచించు నభిలాషము నాకుఁ గలిగె నని తాత్పర్యము.

3. ప:-సత్యము = నిజము;-ధర్మ...గతికిన్ = పుణ్యము, మోక్షము (ముక్తి) అనియెడు రెండు పురుషార్థముల కూడికకును (ప్రాప్తికి ననుట), తగి = సమర్థములై, అర్థకామములు=ధనము, కోరిక అనియెడు (తక్కిన), రెండుపురుషార్థములును, (అర్థకామములు-కర్త), నిత్యసుఖంబున్ = నిరంతరసౌఖ్యమును, అవలీలన్ =చులుకనచేత (సులభముగాననుట), పవిత్రదాంపత్యము = పావన మైన దంపతీభావము, కారణంబుగన్ = హేతువుగా, (నిర్మల మైనదాంపత్యము లోకులకుఁ జులుకగా నిహసౌఖ్యములను గూర్చుటయే కాక పరసుఖమును సయితము గలిగించు ననుట యథార్థ మని భావము.) ప్రమాణమతిన్ =(దీనికి) తార్కాణ(మును జూపు) బుద్ధితో

కృతికిన్ = (ఈ) గ్రంథమునకు, అట్టిశుద్ధదాంపత్యము = అటువంటి [చతుర్విధ పురుషార్థములను (ధర్మ, అర్థ, కామ, మోక్షములను) బొందిన] దంపతుల (భావము)ను, ప్రోషితప్రియసమాగమమున్ = దేశాంతరమును బొందిన నెచ్చెలి కూడికయును, కథగా గ్రహించితిని.

నిర్మల మైన దాంపత్య మిహపరసౌఖ్యములనవలీలఁగలిగించు ననుట సత్య మని చూపుటకై అట్టిదాంపత్యమును ఎడఁబాసిన నెచ్చెలిని గలిసికొనుటయుఁ గల కథను దీసికొని యీ గ్రంథమును రచించితి నని తా.

4. ప:—భ్రమపడన్ = భ్రాంతి పడునట్లుగా, గ్రామ్యవాదము = గ్రామ్యపదములను ప్రయోగించి గ్రంథములను రచింపవలయునను నియమముతో వాదించుట, పురాతనసంప్రదాయదాస్యము = చిరకాలము క్రిందటి దగు పెద్దల నడవడికయొక్క సేవ, స్వతంత్రకావ్యమున్ = స్వచ్ఛందగ్రంథమును (ప్రబంధనియమములకు లోఁబడని కావ్యము ననుట; తెలుఁగు బాసయం దింతకు మున్ను లేని రీతి గల కావ్యము నని భావము), నియమాంచితంబున్ = (గ్రామ్యవాదము నాదరింపక) పూర్వుల నిబంధనములకు లోఁబడినదానిని, ఆరయువారో = కనుఁగొనువారో (ఆదరించువారో యని భావము), విచారము = చింత, ఈక్షమన్ = ఈభూమియందు, ననుఁబోని = నన్నుంబోలిన, పాఠకుఁడు = చదువరి, ననుఁబోనిపాఠకుఁడు = ఇతరుల గ్రంథములను నే నెంత ప్రీతితోఁ బఠించుచున్నానో అంత ప్రీతితోఁ జదువు వాఁడు. పూర్వు లేర్పఱిచినకట్టుపాటులకు దాస్యము చేయుచుండఁగా నడుమ (పిల్లలపిడుగువలె) గ్రామ్యవాదము బయలుదేఱి భ్రమపెట్టిన దనియు, నట్టిభ్రాంతికి లోనుగాక పూర్వనియమములను గైకొని నూతనమార్గమునఁ గావ్యము రచించితిని గావున దీని నాదరించు భారము ఈగ్రంథము రచించిన కాలము నాఁటివారియం దున్నదనియు, నితరభాషలయందున్న యిట్టి కావ్యములను గని యానందించిన నావలెనే నూతనవిధమున నున్న యికావ్యమును బఠించి యానందించువా రొక్కరైన నుండరా యనియు, నట్లుండకపోరు గావున విచారము లే దనియుఁ దాత్పర్యము.

5. ప:—పాయక = విడువక, మద్గురుండున్ = నాగురువును, బుధవంద్యుఁడు = పండితులచేఁ గొనియాడఁబడఁదగినవాఁడును, కీర్తిశేషుఁడు = యశస్సుచేత మిగిలినవాఁడు, ఆ యసమానధీరు ప్రతిభాతిశయంబు = సాటిలేని యా పండితునియొక్క ప్రజ్ఞావిశేషము (అధిక మైన ప్రజ్ఞ), జగత్ హితంబుగాన్ = లోకమునకు మేలు చేయున దగునట్లు, ఆయతనంబున్ = నివాసమును, కాంచుతన్ = పొందుఁగాక, మత్ ఆత్మసరోజమునందున్ = నామనస్సనెడి పద్మమునందు, నిచ్చలున్ = ఎల్లప్పుడును. (జయంతి భావనారాయణ గారు - ఈయన చరిత్రముంగూర్చి యాంధ్రపత్రికయొక్క సిద్ధార్థిసంవత్సరాది సంచికను జూడనగును.]

6. ప:—ప్రతిభ = అప్పటి కప్పుడు వికసించెడు బుద్ధి, ఫలము = లాభము = ప్రయోజనము, ప్రథితసారస్వతమునకున్ = ప్రసిద్ధమైన వాఙ్మయమునకు (వాఙ్మయము = విద్య), రసికపాఠకులు = సరసులైన చదువరులు, ఆంధ్రజగము = ఆంధ్రలోకము (భావనారాయణకవిగ్రంథములు శ్రేష్ఠములైనను వానికి వ్యాప్తిలేక పడియున్న వని భావము.)

7. ప:-రాజప్రజాశ్రయములు - రాజ = రాజులయొక్కయు, ప్రజ = ప్రజలయొక్కయు, ఆశ్రయములు = ప్రాపులు, అవ్యాజములుగన్ = కపటము లేనివి కాఁగా (భిన్నభావము లేక విశేషానుగ్రహము గల వగుచుండఁగా నని భావము.) ఆంధ్రవాఙ్మయము = ఆంధ్రసారస్వతము (విద్య, దేశీయశ్రీజనకము = దేశసంబంధలక్ష్మిని పుట్టించునది, పూజ్యము = పూజింపఁదగినది, రాజిల్లుఁగాతన్ = వెలయుఁగాక, భాసురసువర్ణగతిన్ = ప్రకాశించు మంచి యక్షరముల పొందికచేత నని యర్థము. (ప్రకాశమాన మైన బంగారము యొక్క ప్రాప్తిచేత లేక విధముచేత నని యర్థాంతరము.)

ఆంధ్రవాఙ్మయము దేశమును భాగ్యవంతముగాఁ జేయునదియు, పూజల నందఁదగినదియు నై వెలయునట్లు మహారాజులును ప్రజలును అనుగ్రహముతోఁ జేయుదురుగాక యని తాత్పర్యము.

## అంకితము

1. ప:-అమితానుకంపన్ = మితిలేని దయతో, విద్యాబుద్ధులన్ = చదువును తెలివియు, (ఇచ్చట తెలివిని నేర్పుట యనఁగా తెలివి కలుగుట కును, అది వ్యాపించుటకును దగిన యాధారములను జూపుట యని భావింప వలయును; 'బుద్ధి'యను పదమును మంచినడవడి యను నర్థమునను కొందఱు ప్రయోగించియున్నారు.) తలయెత్తుకొనన్ = ప్రసిద్ధి బొందుటకని భావము, వ్యయము = వెచ్చము, ప్రయాసము = శ్రమము, పాటింపక = గణింపక, ఆర్యుఁడు = పూజ్యుఁడు, సుబ్బరాయ ఆర్యవర్యుఁడు = సుబ్బరాయఁ డను నామముగలవైశ్యశ్రేష్ఠుఁడు, శక్యంబె = తరమా (తరము గాదనియర్థము), కీర్తిమూర్తికిన్ = యశస్సనెడుప్రతిమకు (సుబ్బరాయార్యవరుఁడు మృతి నొందుటచే నతని కీర్తినే యొక ప్రతిమగా నేర్పఱచుకొని దాని కీ గ్రంథము నంకితమొనర్తు నని భావము.)

2. ప:-అనుబంధము = సంబంధము, పల్మాటలు = పలుమాటలు = పెక్కు పలుకులు, గోత్రసంపుటిన్ = గోత్రసంబంధమున, బాంధవము = బంధుత్వము, పరిణామము = పరిపాకము, సమంజసంబుగన్ = ఒప్పుగా (న్యాయముగా ననుట). కొరర్లవారిగోత్రము = పౌలస్త్యగోత్రము; ఋషులు- ఆంగిరసాదులు. కవిగోత్రము = భారద్వాజగోత్రము; ఋషులు-ఆంగిరస బార్హస్పత్యభారద్వాజులు. ఇందు ఆంగిరసమౌని యుభయుల గోత్రముల యందును గలఁడు.

3. ప:-ఆబాల్యమిత్త్రులు = పిన్ననాఁటి నెచ్చెలులు, తేజరిలిరి = మెఱసిరి.

4. ప:-విద్వన్మణి = పండితరత్నము, స్వయంవ్యక్తిత్వము = (తెలివి) తనంతటఁ దాను రూపొందుట, ఏపారన్ = అతిశయింపఁగా, సద్యోవిజ్ఞాన చమత్కృతియాఢ్యతన్ = అప్పటికప్పుడె కలిగెడు అతిశయమైన తెలివియొక్క చమత్కారముచేత నైన ముఖ్యత్వముచేత, ప్రభుతోద్యోగి = దొరతనము (వారి)యొక్క అధికారియై (ఈసమాసమున కిక్కాలము ననుసరించి

యర్థము ప్రాయనయ్యె.) తద్గతప్రావీణ్యంబునన్ = ఆ యధికారమునఁ గల నేర్పుచేత, ఉన్నతిన్ = అతిశయమును (డిప్యూటీ కలెక్టరు పదవిని), యశః ప్రాగల్భ్యముక్తావళీధావళ్యంబునన్ - యశః = కీర్తియొక్క, ప్రాగల్భ్య = అతిశయము నెడు, ముక్తావళీ = ముత్తెముల బంతియొక్క, ధావళ్యంబునన్ = తెలుపుచేత, ముంచి తేల్చెన్ = నిండించెను (తానమాడించె ననుట), కకుబంతంబు = దెసల చివర ప్రదేశములను, ఉర్వరామండలిన్ = భూమండలమునందు, (తెలివి మూర్తిభవించినదో యనునట్లులు పండితశ్రేష్ఠుఁడైన యా కొరళ్ల సుబ్బారాయఁడు గారు తన విశేషజ్ఞానముచేత హూణభాషయందలి పరీక్షలయందుత్తీర్ణుఁడై ప్రభుత్వమువారి (గవర్నమెంటు) కడ నుద్యోగియై యందలి నేర్పుచే (డిప్యూటి కలెక్టరు అను) గొప్ప పదవి నంది తన కీర్తి ముత్తెముల బంతిచే దెసల నలంకరించె నని భావము.

5. ప:- వివిధభాషాకళావేత్త = అనేకభాషలయందలి విద్యను దెలిసినవాఁడు, లేక వివిధములైన భాషలను కళలను తెలిసినవాఁడు, వేదవిహితకర్మశీలుఁడు = వేదములయందుఁ జెప్పఁబడినకర్మములయొక్క యాచారముగలవాఁడు (వేదవిహితకర్మములనొనర్చువాఁడనుట), సప్తసంతానకీర్తి ప్రశస్తమూర్తి = సప్తసంతానములయొక్క కీర్తిచేతను బ్రశంసింపఁబడినవాఁడు (సప్తసంతానములు-"క. తనయుఁడుఁ, జెఱువును, గావ్యంబు, నిధానము, గుడి, వనంబు, భూదేవస్థాపనమును నను నివియేడును। జను శాస్త్రములందు సప్తసంతతు లనఁగన్."—పుత్త్రుఁడు తటాకము ప్రబంధము నిధి దేవాలయము ఆరామము అగ్రహారము. సతతవిద్యాన్నదాత = ఎల్లప్పుడు విద్య అన్నము (అర్థులకు) ఇచ్చువాఁడు, సన్నుతుఁడు = స్తోత్రము చేయబడినవాఁడు.

6. ప:—సులభము.

తా. క.—కృతిపతి కొరళ్ల సుబ్బరాయఁడు గారు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారిచే ప్రద్యుమ్నోపాఖ్యాన మను ప్రబంధమును కృతి నందియున్నారు. అందు కృతిపతి వంశావతారాదులు విపులముగ వర్ణింపఁబడియున్నవి.

## కథారంభము

1. పద్యము:-కలయన్=అంతటను, క్రమ్మెన్ = వ్యాపించెను, ధ్వాంతము=చీకటి, అంబరమునన్=ఆకాశమునందు,ఖద్యోతబింబంబు=సూర్యమండలము, తిలకింపన్=చూడఁగా, [ఈ పద మీ యర్థమునందు నాదికవుల ప్రయోగమున మృగ్యము; అయినను "క. పలుకులు వేయు నిఁకేటికి......చిలుకను దిలకించి ప్రియము చిలుకం బలికెన్" (జక్కన విక్రమార్క చరిత్రము, సప్త. 68 ప.) "చ. ఘనవినయాత్మ నున్నయల కంజశరుం దిలకించి......" (సురభిమాధవరాయనిచంద్రికాపరిణయము, ద్వితీ. 56 ప.) "శా. భావం బెక్కడ లేక......తిలకింపంబోరు ధీరోత్తముల్." (వసుచరిత్రము ప్రథమాశ్వాసము 11ప.) ఇత్యాది ప్రయోగములు గానవచ్చెడి.] కనుపట్టదు=అగపడదు [కనిపించు అనునది కనుధాతువు ప్రేరణరూపము. దీనికి కనునట్లు చేయు అని యర్థము. ప్రత్యక్షమగు అను వేఱొక యర్థము కలదు. కాని, అది యిచ్చటఁ బొసఁగదు. మఱియు "క. అని విన్నవింపఁజిత్తము......వత్సలత్వము కనిపింపఁగ హర్షభరవికస్వరముఖుఁడై" (విజయవిలాసము ప్రథమాశ్వాసము, 47 ప.) ఇత్యాది ప్రయోగములు కన్పట్టుచున్నవి. కాని యవియుకనుపట్టఁగ ఇత్యాదిరూపములతో నుండవచ్చునని తోఁచుచున్నది.]సుషమాఆధిక్యంబునన్=ఉత్కృష్టమైన కాంతియొక్క గొప్పతనముచేత, మించెడిన్=అతిశయించుచున్నవి, కెలఁకుల్ కొన్ని=కొన్ని దిక్కులు (చోట్లు), సుషమాధిక్యంబునన్ మించెడిన్-కన్నుల మిఱుమిట్లు గొలుపునంత గొప్పకాంతి నొప్పుచుండె నని యూహింపనగును. అహంబు=పగలు,అరయన్=విచారింపఁగా,చేటు=కీడు,పాటిల్లునో=కలుగునో, విలయంబు=ప్రళయము,ఔనొకో=అగునా యేమి; విడ్డూరముల్=ఉపద్రవములు, కల్గునే=పుట్టునా? (పుట్టవని యర్థము) అహో! (ఆశ్చర్యార్థకము.)

ఒకానొక కారణంబున నున్మాదావస్థ నొంది క్రుమ్మరుచున్న యొక బాటసారి యొక సాంద్రారణ్యమునఁ బ్రవేశించి యసంతకుమున్న తాను

గాంచుచున్న పగటివెలుఁగొక్కనిముసములో మాయమైనట్లు తోఁపఁగా "ఏమిది ప్రళయకాలమా? కాకున్న నిట్టి విడ్డూరములు పుట్టునా? ఇది పగలు గదా! ఇంతలోనే యాకసమునం దంతటను జీకటి గ్రమ్మెనే! సూర్యబింబము కానరాదే! అయిన నచ్చటచ్చట వెలుంగు కన్పట్టుచున్నదే! ఒక్కత్రుటిలోనే యిట్టి గొప్ప మార్పు గలుగుటచే నెద్దియో కీడు సంభవింపనున్నది కాఁబోలు!" అని భ్రాంతిని చెందెను.

గ్రంథారంభమునఁ గవి గాక పాత్రమే యిట్లు మాటాడిన ట్లుండుట మన దేశమున దృశ్యప్రబంధములయందే కాని తక్కిన కావ్యములఁ గానరాదు. ఇది (ఆంగ్లేయాది) పాశ్చాత్యగ్రంథసంప్రదాయము. ఈ చిన్ని కావ్య మాంగ్లేయగ్రంథము ననుసరించి వ్రాయఁబడినదియే. కావునఁ గవియు దీని రచనమునందుఁ దత్సంప్రదాయమును గ్రహించెను.

2. ప:—ఏముహూర్తంబునన్=ఎట్టివేళ నని భావము. నిశాంతము =ఇల్లు, ఎడలితిన్ ఒకో=విడిచితినో, అవశకునముల్=దుశ్శకునములు, తల్లడిలున్=చలించెను, ఎడంద=హృదయము. ఈ పద్యము నాలవ చరణమునందలి యతి చింత్యము. కవి దీనిని ఇంచుగాగమయతిని మనంబున నిడుకొని ప్రయోగించినట్లు తోఁచుచున్నది. ఇంచుగాగమయతియే పూర్వకవిమతంబున నగ్రాహ్యము.

3. ప:—ప్రాణపదము=ప్రాణములయొక్క స్థానము, వ్రయ్యక=బ్రద్దలుగాక, విషాదపడు=ఖేదపడు, (ప్రాణములతో సమానమైన చెలి నెడఁబాసియు వ్రయ్యని యీ పాడుమన స్సింతకంటె నధిక మగు చెడు గింక నేమి కలుగు నని శోకించుచున్నదో తెలియ దని యర్థము. (తక్కిన కష్టములు నెచ్చెలి నెడఁబాసినదానికంటె నెక్కుడు కా వని భావము.)

4. ప:—హృది= మనస్సు, సానుక్రోశవృత్తి గలది=దయతోఁ గూడిన వ్యాపారము గలది (దయాస్వభావము గలది యనుట), తత్‌వృత్తి కారణముగన్=ఆ వ్యాపారమే హేతు వగుటచేత, ప్రేమలక్షణము= స్నేహముయొక్క చిహ్నము (స్నేహధర్మము). వెఱవ నేల=భయపడ నేల?

5. ప:—తమము=చీకటి, నీరదకదంబము=మబ్బులగుంపు, పయోరుహ ఆప్తబింబము=సూర్యబింబము (పయః రుహము=పయోరుహము=నీటి పుట్టువు=పద్మము; ఆప్త=మిత్రము.) కార్కొనిన=నల్లఁబాఱిన, వారిదమాలిక=మబ్బుచాలు, విమలతటిత్ లతాద్యుతి=స్వచ్ఛమైన మెఱుపుఁదీవల కాంతి, రవిప్రభ=సూర్యకాంతి, చింత=విచారము, వర్షకణాళి=వానచినుకుల చాలు, నిదర్శనంబుగన్=తార్కాణ మగునట్లు, ఈ పద్యమునందలి నీరదవారిదశబ్దములకు నీటి నిచ్చు మేఘము లని యర్థము. అట్టి మేఘములు మిక్కిలి నలుపుదేఱియుండును. కావున నవి తమోభ్రాంతిని గలిగించె నని యెఱుంగునది. తొలి పద్యమునందలి భావముల నీ పద్యమునందలి యభిప్రాయములచే నా వెఱ్ఱి బాటసారి పోఁగొట్టుకొనె నని యూహింపవలయును.

6. ప:—చలనస్వభావతటిత్ ఆళి=కదలికయే గుణముగాఁగల మెఱపుల పంక్తి, వని=అరణ్యము, వర్షబుద్ధిమైన్=వానయనెడి మతిచేత, అవివేకము=తెలివిలేమి, చిత్తవిభ్రమము=మనస్సుయొక్క విభ్రాంతి, అలమినన్=ఆక్రమింపఁగా, ఏరు=ఎవ్వరు, దృష్టిగల యంధులు=చూపు (కన్నులు) గల గ్రుడ్డివారు, విచార మేటికిన్=చింత యేల ?

కొమ్మలనడుమనుండి యాకసమునఁ గన్పట్టు కాంతులు మెఱపులుగా భావించిన యా బాటసారి యిప్పు డించుక తెలివి గలవాఁడుంబోలె నిట్లు తలంచెను. "మెఱపుల పంక్తి చలింపకుండునా? ఇది వర్షము గాదు. ఎంత యజ్ఞానమును బొందితిని ! చిత్తవిభ్రాంతిఁ జెందినవారు కన్ను లున్నను గ్రుడ్డివారే కదా!"

7. ప:—నెమ్ములు = నెమిళ్లు (నెమ్మిశబ్దము బహువచనము.) పింఛము=పురి (తోఁక), విరియన్=విడఁబాఱఁగా, నృత్యము=నాట్యము, ఒనర్చరున్ = చేసెడిని, మిళిందబృందగీతమ్ములకున్ = తుమ్మెదమూఁకల పాటలకు, ఇమ్ముగాన్=అనుకూలముగా, సలిలధారలన్=నీటియొడికలను, చాతకమ్ములు=వానకోయిలలు, అభ్రమ్మునన్=ఆకాశమునందు, చంచు

వులన్=ముక్కులను, రాజమరాళములు = రాయంచలు (ఎఱ్ఱనిముక్కును కాళ్లును గల యంచలు రాజహంసము లనఁబడును, పమ్మిన=అతిశయించిన), భీతి=భయము. ఆయా పక్షు లొనర్చు నాయా చేష్టల నన్నిటి నీ బాటసారి గాంచి వర్ష కారణమున నే యవి యట్లుచేయుచున్నవనియు భ్రాంతి వహించె ననియు భ్రమఁ జెందెను.

ఈ పద్యమునకుఁ దరువాత నున్న పద్యములను బట్టి యిది వసంత కాల మని తెలియుచున్నది. కవిసమయము లగు "వర్షాస్వేవమయూరాణాం రుతం నృత్యంచ వర్ణయేత్." (వర్షాకాలములయందే నెమిళుల కేకలను,ఆటలనువర్ణింపవలయును.)"శరది.....హంస...దర్పాః."(శరత్తున హంసాదులదర్పమును వర్ణించునది.) ఇత్యాదినియమముల నిక్కవి యిందుఁ బాటించియుండలే దని యొక సంశయము దోఁచును. కాని, శ్లేషాద్యలంకారములయందును, కథాసందర్భములయందును కవు లట్టి నియమముల నతిక్ర మింతురు.

"సీ. పరమహంసోత్తమప్రతతిక ప్రతిమానపద్మినీరసనిగుంభనముగలిగె"
(శ్లేష), (హరిశ్చంద్రనలోపాఖ్యానము ద్వితీయాశ్వాసము, వసంత వర్ణనము.)

"ఉ. కేళివనాళి...నీలకంఠములు పాయక మోయు...షట్పదీ
మాలికఁ దోఁచు నబ్బురపు మబ్బుల యుబ్బులు గుబ్బతిల్లఁగన్."
(వసుచ. ప్ర. వసంతవ.)

[దేవపారిజాతమును వీడ్కొని (ఆకాశమున) వచ్చు తుమ్మెదల బారును గాంచి (వనమునందలి) నెమిళులు మబ్బులనెడి భ్రాంతిచేఁ గేకారవము లొనర్చుచుండును.]

నలచక్రవర్తి చరిత్రము గల గ్రంథములలో హంసాగమనముఁ జెప్పు భాగములయందు ఋతునియమము గమనింపఁబడలేదు.

మఱియు నాయా ఋతువులకు నన్యము లగు కాలములయందు మయూరములు రాజహంసములు నుండుట లోకసిద్ధమే. ఐనను వర్షేతర

ర్తువునందుఁ జాతకము లుండు ననుట మాత్రము కవిసమయము కాదని తోఁచెడి.

8. ప:—అవిరళ...మండలంబు=అవిరళ=ఎడములేని, పర్ణ=ఆకుల చేత, శోభిత=ప్రకాశించునవియు, దిగంత=దెసలచివరలయందు, విగాహి=ప్రవేశించుచున్నవియు, (అగు) లతా=తీవలచేత, నిగూఢ=మిక్కిలి దాఁపఁబడిన, కైరవరిపుమండలంబున్=సూర్యమండలముగలదియు, కైరవము=తెల్లగలువ, (దానికి) రిపు=శత్రువు (సూర్యుఁడు). (దట్టము లైన యాకులు గల తీవలు దిగంతము లగపడకుండునట్లు నేలను బ్రేలుచు సూర్యబింబమును మఱుఁగుపఱుచుచున్న వని భావము.) శిరఃపరిచుంబితమేఘమార్గమున్=తలలచేత ముద్దుపెట్టుకొనఁబడిన యాకాశము గలదియు, (వృక్షములు మిక్కిలి పొడుగు గలిగియుండుటచే వానికొన లాకసము నంటుచు మేఘభ్రాంతిని గొలుపుచున్న వని భావము.) భువన...భాసమానమున్-భువన=లోకమునకు, విలాసకారి=శోభను (గలుగఁ) జేయు స్వభావము గల, నవపుష్పవిశేష=క్రొత్త పూవుల భేదములచేత (అనేకవిధము లగు క్రొత్త పువ్వులచేత ననుట.) విభాసమానమున్=అధికముగఁ బ్రకాశించుచున్నదియు, (అప్పుడే వికసించిన పలువిధము లగు పూవులు భూమికి సింగారమును గలిగించు నధిక ప్రకాశముచే నొప్పుచు మెఱపులను భ్రాంతిని పుట్టించుచున్న వని భావము.) వివిధఫలప్రసూనరసవృష్టిమయంబున్=నానావిధములైన పండ్లరసములయొక్కయుఁ బూఁదేనెలయొక్కయు వాన గలదియు (అగు), అరణ్యము=అడవి, ఇయ్యెడన్, (ఒప్పును). ఇప్పుడు బాటసారి యున్మాదము తొలఁగి తాను అరణ్యమధ్యమున నున్నట్లును, మొదటివి (1, 5పద్యములలోఁ బలికినవి) ప్రలాపము లైనట్లును తెలిసికొనెను.

మొదటి పద్యమునందలి చీకటి 5-వ పద్యమున మబ్బులగుంపుగా మాఱి, యిప్పుడు దట్టములైన యాకులును తీవలును గలిగి యాకసమునంటుచున్న మహావృక్షసమూహములచేఁ బొడమిన వెలుతురులేమి యైనది. ఆ లతాదులు సూర్యబింబమును కప్పినవి. (అచ్చటచ్చట వృక్షాగ్రముల సందుల

పురుషులకు కుడికన్నను అదరుట శుభమును సూచించును. అది తాఱుమాఱైనచో నశుభసూచక మగును. ఇచ్చట నాబాటసారికి శుభసూచక మగుస్పంద మనియే గ్రహింపవలయును.) 'దేనివలనన్' అనుటకు 'ఎందువలనన్' అని యిందుఁ బ్రయోగింపఁబడినది. 'ఎందువలనన్, ఎందుకొఱకున్, ఎందుచేతన్' ఇత్యాదు లాధునికకవిప్రయోగములు.

12 ప:—ముదంబు=సంతోషము, నవమోహనాకృతిన్ = క్రొత్తదైన మోహింపఁ జేయు ఆకారము గల, కేవల... సేవధిన్-కేవల=ఒక్కటియే యైన, తావకపుణ్య=నీ(సంబంధమైన) పుణ్యముయొక్క, సేవధిన్=నిధిని, గర్వోన్నతిన్=అతిశయమైన గర్వముచేత. తనివి తీర ననుభవింప వలసిన వెన్నముద్దను పాఱవైచుకొని(యది యంటుకొనిన) వ్రేళ్లను నాకినట్లు మనోజ్ఞత గల నీప్రాణమిత్త్రిమును చేఁ జిక్కినప్పుడు విడనాడి ఇప్పుడీ శుభనిమిత్తము తోఁచినంతనే యేలపొంగెదవు చిత్తమా! యని తాత్పర్యము.

13 ప:—సిలుగులు=ఆపదలు, గిలిగింతలు = చక్కిలిగింతలు, అడియాస=వ్యర్థమైన కోరిక, కలిత-చిరత్నమున్-కలిత=ప్రసిద్ధమైనదియు, చిరత్న=ప్రాఁతది (యగుటచే శ్రేష్ఠమైనది)యు, (అగు) రత్నమున్=మణి సయితము (ఇచ్చటినకారముసముచ్చయార్థకము.) కానివేళలన్=సమయము కానియప్పుడు (సమయము తప్పినప్పు డని భావము.) 'కలుగు' శబ్దము మొదలుకొని 'చేకుఱు' శబ్దమువఱకు మనస్సును హేళనము చేయు విరక్తి వాక్యములు.

14 ప:—నిక్కముగన్=నిశ్చయముగా, వితర్కించుటల్=సంశయించుటలు, మృదుల... విలాసములన్-మృదుల=మెత్తనివియు, స్వాదు=తీయనివియు (మనోహరములైన వనుట), (అగు) వచః+విలాసములన్=పలుకుల నేర్పులచేత, స్పర్శామేయసౌఖ్యమును, వీనులు=చెవులు, అవశత్వము=వశము కాకపోవుట, స్పర్శామేయసౌఖ్యంబునన్=తాఁకుడుచేనైన మితి లేని సౌఖ్యముచేత, రవికరముల్=సూర్యకిరణములు, అన్యాంశువుల్=ఇతర (చంద్రనక్షత్రాదుల) కిరణములు.

ఈపద్యమునందలివి యున్మాదశేషముతోఁ గూడినవాక్యములే కాని యితరములు కావని యూహింపవలయును. సూర్యకిరణములు దక్క నితర కిరణములు పద్మము నెట్లలరింపలేవో యట్లే తననెచ్చెలి వసుస్పర్శాదులే కాని యన్యము లెవ్వియుఁ దనమేనువీనులకు హాయిం గూర్పలేవని యీ పద్యమునందలి తాత్పర్యము. ఇచ్చటఁ దన నెచ్చెలి గాని మఱియెవ్వరు గాని లేరు. కోయిల కూఁతయు మలయమారుతస్పర్శమును నిట్టి భ్రాంతిని గొలిపినట్లు 17-వ పద్యమువలనఁ దెలియుచున్నది. ఇప్పలుకులు నిండుమనంబునఁ బలికినవే యని యూహించినచో నిచట నౌచిత్యమునకు భంగము సంభవించును. ఎట్లన, రవికరములు పద్మము నలరఁజేయును. పద్మరాగమయూఖములు (ఎన్నియైనను) కమలము నలరింపఁజాలవు. అట్లే యీబాటసారి నెమ్మేను తత్ప్రాణమిత్త్రస్పర్శమునం దక్క నితరస్పర్శములచే నెన్నఁడును సౌఖ్యమును గనఁజాలదు. అట్టిచో దక్షిణానిలస్పర్శముచేతనే యది హాయిం జెందెనేని యీబాటసారియనురాగము ఉచితమైనదగునా? కావున నిచట నా బాటసారియున్మాదావస్థ నొక్కమాఱు జ్ఞప్తికిఁ దెచ్చుకొనవలయును.

15 ప:—అనుమానము = సంశయము, దైవము, అవనిన్=భూమియందు, అసాధ్యము=నెఱవేర్పఁదగనిది, తథ్యము=నిజము. దైవ మనుకూలమైనచో నన్నిమార్గములును జక్కఁబడు నని తాత్పర్యము.

16 ప:—ఆకస్మికముగన్=ఉన్నట్టుండి, లభించెన్=అబ్బెను, వేగిరించి=త్వరపడి, కందోయిన్=నేత్రద్వయమును (రెండు కన్నులను), కడఁకన్=పూనికతో, చెలిన్=మిత్త్రిమును. కన్నులు విచ్చినచో నప్పుడొందుచున్న సుఖము చెడునేమో యని సంశయము.

17 ప:—ఆరయనైతిన్, ఆలోచింపనైతిని, కౌతుకము=ఆనందము (సంతోషకారణ మనుట), కను మూయఁగన్=కన్నులు మూసికొనుటచేత, పికోక్తిన్=కోయిల పలుకుచేత, ఊఱడనాడి=ఊఱడించి, సర్వ...కరంబునన్=సమస్తపుష్పశ్రేష్ఠములచేతను బరిమళింపఁజేయఁబడిన మలయమారు

తము యొక్క మొలక (ప్రసారము) అనెడి హస్తములచేత, నిమిరి=దువ్వి, కూర్మి=ప్రేమముతో, వన+ఇందిర=వనలక్ష్మి, ఆదరించెడిన్=మన్నించెడిని, కారణహీనము=హేతువుచే శూన్యమైనది (హేతువు లేని దని భావము), అనుకంప=దయ, జనింపన్=పుట్టుటచేత హృదంతరంబునన్=మనస్సులోపల. (14-వ పద్యము చూ.) ఈపద్యమునందలి ప్రాసమున రేఫఱకార సాంకర్యము చేయఁబడినది.

18 ప:—ఉరుసుఖము= గొప్ప సౌఖ్యము, ఏది=నశించి, భయంకర గహన+అంతరాళములన్=ఘోర మైన యరణ్యముయొక్క నడిమిచోటు లందు, సత్కృతిన్=సత్కారమును=గౌరవమును, నెఱపితి=అతిశయముగఁ గూర్చితివి ('నెరపితి' అనియు నుండవచ్చును), నిర్నిమిత్తము=పోయిన కారణము గలది (కారణము లేని దని భావము), కృప=దయ, ద్విజ+ఆదరణము=ద్విజులయొక్క మన్నన (కర్మార్థమున షష్ఠి-ద్విజులను మన్నించుట యని యర్థము, పక్షులను మన్నించుట యని యర్థాంతరము; ద్విజులు=జన్మముచేతను కర్మముచేతను రెండు మాఱులు పుట్టువారు=బ్రాహ్మణక్షత్రియవైశ్యులు. ద్విజము=గ్రుడ్డుగా నొక మాఱును గ్రుడ్డునుండి యొకమాఱును బుట్టునది=పక్షి మొ.)

19 ప:—బలదవిహీనవర్షగతిన్=మేఘములచే శూన్య మైన వానయొక్క విధముచేత (మబ్బులేనివానవలెనని భావము). సంతసము=సంతోషము, తెలివి=జ్ఞానము, అకాలమారుతముతీరునన్=అసమయవాయువురీతిని (అధికముగా వీవఁ దగినకాలము కానియప్పు డధికముగా వీచిన గాలివలె నని భావము), నెట్టన=అనివార్యముగా, దాపరించి=కలిగి, పొందు=సుఖ మనెడి గట్టు, వచింపు=చెప్పుము.

20 ప:—అవయవముల్ = (కరచరణాది) అంగములు (శరీర మని భావము), కృశింపఁ దగున్ = చిక్క నొప్పును (చిక్కుగాక యని భావము), కన్గవన్ = నేత్రద్వయమునుండి, జలమున్ = నీరును (ఇచ్చటి 'ఉ'కారము సముచ్చయార్థబోధక మని యెఱుంగునది), తొరంగనగున్ =

ప్రవహింపఁదగును (తప్పక ప్రవహించుఁగాక యని భావము). (ఈవాక్య మునందలి 'తోరంగన్' అనుదానిని 'తొలంగన్' అని దిద్దినచో, కన్దవ = రెండు కన్నులును, జలమున్ = నీటిని, తొలంగనగున్ = విడుచుఁగాక అను యను నర్థము వచ్చును.) ధ్రువముగన్ = నిక్కముగా, త్రోచి తొలంగి = తొలఁగఁజేసి యెదుఁగఁబొఅని (త్రోచి తొలంగు=ఎదుట నున్నవారిని ద్రోచివైచి తా నోసరిల్లు), అవిధి=కష్టము, అక్కజము=ఆశ్చర్యము.

21 ప:—భరియింపఁగరాని=మోవఁజాలని(సహింపరానియనుట). వియోగబాధ=విరహవ్యథ, జ్ఞానవిహీనుఁడు=తెలివిచే హీనుఁడైనవాఁడు (తెలివి లేనివాఁ డని భావము), నిక్కము=నిశ్చయము, ఇక్కరణిన్ = ఈకరణిన్ = ఈవిధముగా.

కాలమా! అక్కలుగట్టుకొన్నట్లు నీ వతిశీఘ్రముగఁ బోవుచుందు వని వ్రాసిన కవి తన నెచ్చెలి నెన్నఁడు నెడఁబాసినవాఁడు కాఁడు. ఇది నిశ్చయము. కానిచో నెంతటి వెఱ్ఱి యైనను నిట్లు వ్రాయుగా! అని తాత్పర్యము. (వియోగదుఃఖము గలవారికి నిముస మొక యుగమువలెఁ గన్పట్టుచుఁ గాలమునకుఁ గాలు విఱిగిపోయినట్లు తోఁచుచుండు నని ఫలితార్థము.)

22ప:—మందున్=మనుదున్=బ్రదుకుదును, మోహవార్ధినిమగ్నతన్=మోహసముద్రమున మిక్కిలి మునిఁగియుండుటను, కరిదృతిన్=దేహము యొక్క ధరించుటను, కుందు=దుఃఖము, ప్రుంగుట=వచ్చుట. సులభమార్గము=తేలికత్రోవ, ("తందని మ్రానిపండునకునల్లుసాఁచుట=కార్యకార్యమునకుఁ గడఁగు; 'అల్లులు' అనుటచేఁ బలుమాఱు మెడను నిక్కించినట్లెయుంగవలయును.)

23ప:—పూర్ణప్రయత్నము = నిండుపూనిక, కార్యవిముఖత = పనియందు మాఱు మొగము గలిగియుండుట, కష్టిఫలీ=కష్టపడువాఁడు ఫలమును బొందు (వాఁడు), విబుధులు=పండితులు, నెమకెదన్ = వెదకెదను.

24 ప:—హరిచందనాగములన్=మంచిగంధపుమ్రాఁకులయందును, కర్పూరవారంబులన్=కప్పురపుఁజెట్ల గుంపులయందును, లవలీనికుంజము

లన్=వెన్నెలతీవలపొదరిండ్ల యందును, పున్నాగ+అవనీజంబులన్=పొన్న వృక్షములందును, సహకారబృందములన్=తియ్యమామిడిచెట్లసమూహముల యందును, మందారములందున్=పారిజాతపుఁజెట్లయందును, అనుఁగునెచ్చెలిజాడ=నెయ్యంపుఁజెలియొక్క యీగడ, ఇంచుకయున్=కొంచెమైనను. (అనుఁగునెచ్చెలి=అనుఁగు+నెచ్చెలి—చూడుఁడు బాలవ్యా. సంధిప. 24 సూ.)

25 ప:—ఏవిధిన్=ఏవిధముచేత, బాసట=తోడు, వనకుజాదులె=అడవిచెట్లు మొదలగునవే, తోడ్పడున్=సాయపడును. అటవీమధ్యమునఁ దనకు దిక్కెవ్వరు లేరని యాబాటసారి అరణ్యవృక్షాదులఁ బ్రార్థింపఁ దొడఁగెను.

26 ప:—అన్యులకున్ = ఇతరులకు, ఉపకృతి=మేలు. 'అశోకః పాదతాడనాత్'=అశోకవృక్షముపాదతాడనమువలనఁబుష్పించును (ఫలించును మొ.); (పాదతాడన మనునది దోహదము—దోహద మనఁగా, తరుగుల్మలతాదుల నకాలమునఁ జిగిరింపఁ, బుష్పింప, లేక ఫలింపఁ జేయు క్రియ.) దీనింబట్టి తన్నినఁ గాని యశోకము పూయ దనుట కవులకు సమయమయ్యెను. [అచ్చులోని 'నీస్వకార్య' మనునది My own work, Your own duty- ఇత్యాద్యాంగ్లేయభాషా ప్రయోగముల ననుసరించి వ్రాయఁబడియుండును.]

27 ప:—సకలానందము=సర్వజనులకు సంతోష(కర)మైనది, మత్ప్రియాస్యము=నా నెచ్చెలి మోము, భవత్సంవీక్షితం బేని=నీచేతఁ జూడఁబడిన దైన పక్షమున, మామకదైన్యంబులన్=నా దైనదినత్వమును, జాజికొమ్మా=జాజియొక్క కొమ్మా! [జాజి (అనెడి) చెలీ యని యర్థాంతరము. [నిరర్థకము=వ్యర్థము, వృక్షజాతిమరియాదన్=చెట్లకులముయొక్క కట్టుబాటును, వీడి=వదలి, వాసంతరక్తికిన్=వసంతుని (దైన) యనురాగమునకు. వసంతఋతువున జాజి పుష్పింప దనుట కవిసమయము. "సురభౌ......జాతీతర పుష్పచయ..." [వసంతమున...... జాజి గాక తక్కిన పుష్పసమూహ

ములను (వర్ణింపవలయును)] కవికల్పలత. మఱియు,

“సీ. చంద్రుఁ డెవ్వరి కైనఁ జల్లగా నుండఁడా,
పద్మాలపుణ్య మాపాటి గాక.
వరవసంతుఁడు వచ్చి వన మెల్లఁ బ్రోవఁడా,
జాజి చేసిన యదృష్టంబు గాక” మొ.—అ. గ్రం. చిం.

28 ప:—అరయక = విచారింపక, ఎగ్గు=తప్పు, వాయి = నోరు (బహువచనము వాతులు), కుజములు = వృక్షములు.

29 ప:—శరణ్యామవు=శరణుచొరఁదగినదానవు, కనికరము=దయ, ఊని=పూని. ‘పూనుపొదవుల కాదిలోపం బాకందు (అప్పకవి) వచించె నది యవిచారమూలకంబు’ అని చిన్నయసూరిగారు (బాలవ్యా. ప్రకీ. 10 సూ.) వ్రాసిరి. సీతారామాచార్యులవారుశబ్దరత్నాకరమున‘పూను ధరించు’ ఈ యర్థమునందు దీనికి ఆదిహల్లు వికల్పముగా లోపించును. (చూ. ఊను.) అప్పకవి “ఆ. పూనె నెగసెఁ బొదవెఁ బొనరెఁ బొంచె నటన్న, పలుకులందు మొదలఁ గలుగునట్టి, వ్యంజనంబు లడఁగి వానిపై స్వరములు, నిలుచు వలసినపుడు నీరజాక్ష.” అని సామాన్యముగా విధించిన విధికి చిన్నయసూరి గారు వ్యవస్థ యేర్పఱుపక పూను పొదవు…యవిచారమూలకంబు” అని వ్రాయుటకు కారణ మేమో తెలిసినది కాదు అని వ్రాసినారు. వేదము వేంకటరాయశాస్త్రులవారు శృంగారనైషధవ్యాఖ్యానమున 135 పుటయందు ‘పూను’ నకు ధరణార్థమున రూ. ‘ఊను’....కావున బాల వ్యాకరణోక్తిని పాటింపక అప్పకవివచనము నిట నంగీకరింపవచ్చును .........” అని వ్రాసియున్నారు.

ఇప్పట్టున సూరిగారి యభిప్రాయ మైనను నిరాకరింపఁదగినదిగాఁ దోఁపదు. ఏమన, ‘నెగయు—ఎగయు’ ‘పొనరు—ఒనరు’ (ఇట్లే నీలుగు—ఈలుగు మొ.) ఇవి యాదివ్యంజనలోపంబున (అనేకార్థములలో) పరస్పర సంబంధలోపంబు లేక రూపాంతరములై యున్నట్లు గన్పట్టుచున్నవి. ధరణార్థమునం దక్కఁ దక్కిన యర్థములయందు ‘పూను’ ‘ఊను’ లకు సంబం

థము గానరాదు. దీనంజేసి 'పూను' వకు 'ఊను' ఆదివ్యంజనలోపంబున నైన రూపాంతర మనుకొనుటకంటె (పర్యాయపద మగు) శబ్దాంతర మనుకొనుట యొప్పని భావించి సూరిగారు పైవిధమున వ్రాసిన ట్లూహింపఁ దగి యున్నది. (ఇట్లే తూఁగు—ఊఁగు=ఆందోళించు మొ.)

అప్పకవిపద్యమును పై పండితు లందఱును బఠించియే యున్నారు గదా! 'పొదవు'ను గూర్చి చూడుఁడు! ఈ శబ్దము శబ్దరత్నాకరమున లేదు. మఱియు (అప్పకవి విధిప్రకారము దీనికిరూపాంతర మనుకొనఁబడఁదగిన) 'ఒదవు' శబ్దముకడనైనదీనియునికి గానరాదు. ఒక్క శబ్దరత్నాకరమునందన నేల? అచ్చుపడియున్న యే అకారాదినిఘంటువునందును, ఏపద్యనిఘంటువు నందును ఈశబ్ద మున్నట్టు దోఁపదు. ఇది భాషయందుఁ గలదా? లేదా? ఇత్యాదిచర్చ కిది యదను గామి విరమింపవయ్యెను. 'పొదలె' అనుటకు నే తాళపత్త్రగ్రంథలేఖకుఁడో యేముద్రాపకుఁడో 'పొదవె' అని వ్రాయఁగా, లేక ముద్రింపఁగా సూరిగారు మొదలగువా రీశబ్దము నిట్లు గ్రహించి యుండి రని తోఁచుచున్నది.] మనుష్యులు మీ కొలమువారిని జెఱియందుంచెద రను కోపమును బూనితివా యేమి ముక్కును మొగ మెఱ్ఱఁజేసి కొనెదవు? ('ముక్కును మొగ మెఱ్ఱఁజేసికొనెద' వన్నంజాలును; 'కోపము చూపెదు' అన నక్కఱ యుండదు.)

30 ప:—గహనమునన్ = అడవియందు, చరించెదవు = తిరిగెదవు, మత్ప్రియాస్యమన్ తుహినకరున్ = నాచెలిమోముచంద్రుని, తోట్రిలెదు = తడఁబడెదవు, శ్రవఃకుహరములు = చెవు లనెడు కొండబిలములు, అట్టె = ఉన్నట్టుండి (అకస్మాత్తుగా) [అట్టె, ఇట్టె అను రెండుపదములును గొన్ని ప్రదేశములందు మంచి యర్థములు గలుగు భావములతోనే వాడఁబడుచున్నవి. "వాఁడు ఇట్టెవచ్చినాఁడు" ఇట్టె=1. శీఘ్రముగాలేకత్వరలోనే; 2. అకస్మాత్తుగా (తలమీఁద ఱాయి యిట్టె పడినది) మొ. "అట్టె పోయితి వేమి? అట్టె=అప్పట్టుననే; (పోయినపోకగానే యని భావము.) 2 అకస్మాత్తుగా (ఆవార్త విన వానిగుండె లట్టె బ్రద్దలయినవి.) మొ. కాని

ముని యీ యర్థములఁ బూర్వకవుల గ్రంథములందుఁ గానరావు.]
వ్రయ్యన్=బ్రద్దలగునట్లు, 'కుహూ' (కోయిల 'కుహూ' యని కూయును.)
గ్రంథములయందు 'కుహూ' అనియే ప్రయోగము. ధ్వనినిచెప్పునప్పుడు
హ్రస్వము గల పదము నయితము సాధు వని తలంపవచ్చు నని తోఁచెడి.
కుహూవు = అమావాస్య (చంద్రకళ గానరానిది; చంద్రకళ కొంచె మున్న
యమావాస్య సినీవాలి.) (సాదృష్టేందు స్సినీవాలి సానష్టేందుకలా కుహూ.
అమరము ప్ర. కాం.) గ్రసించెనే=మ్రింగెనా? పోయలు=కీడ. 'కుహూ'
అను కోకిలశబ్దమును విని యబ్బాటసారి తన ప్రశ్నమునకు నది 'కుహూవు'
అని యుత్తర మిచ్చె నని తలంచి 'కుహూవు' (అమావాస్య మ్రింగె నని
యకోకిల చెప్పుచున్న దని గ్రహించెను. ఆస్యపుంసుహిసకసకన్ — ఈ
సమాసము ఇట్లుండుట సరి కాదు. (మార్పఁబడినది- గ్రం.క.)

31 ప:—విచారభారమునన్=చింతయొక్క బరువుచేత (దుఃఖాతి
శయముచేత ననుట), ప్రకటప్రీతి=స్పష్టమైనసంతోషము లేక స్నేహము.
ఎలర్పన్=అతిశయించుచుండఁగా, ప్రత్యక్షమై=సాక్షాత్కరించి. ఇది
స్త్రీజేతరలింగములయం దిట్లుండఁగూడ దని కొందఱియభిప్రాయము; 'ప్ర
యమై' ఇత్యాదిప్రయోగములు మహాకవుల గ్రంథములయందుఁ గన్పట్టు
చున్నవి. 'వివాహమై,' 'సన్నిధి యయ్యె సర్వేశ్వరుండు' 'ప్రయాణమై'
ఇత్యాదులవలె నివియు నొక వన్నె జాతీయప్రయోగములలోఁ జేరు నని
తలంపవలసియుండును.) ఇంద్రియప్రకరంబున్—కన్నుముక్కు మొదలగు
నవి యింద్రియము లనఁబడును; ప్రకరము=సమూహము (ఇంద్రియసమూ
హము), తనియించి=తృప్తిపఱిచి, సమాశ్వాసించెన్=ఊఱడించెను, స్రుక్క
యున్=మరణించియు, విధీ=దైవమా! తా నమితదుఃఖముచే మూర్ఛిల్లఁగా,
ఆ మూర్ఛావస్థలోనె చచ్చిన తనమిత్రము సాక్షాత్కరించి తన్నుఁ గౌఁగి
లించినట్లు భ్రాంతి గలిగిన కారణమున మృతి నొందియుఁ దనపైఁ బ్రేమ
మును విడువనేరనియట్టి నెచ్చెలి ఋణ మెట్లు తీర్చుకొందు నని యాబాట
సారి దురపిల్లెను.

'అకటా, ప్రకట, ప్రకరంబున్, ఇఁకన్' సబిందుకనిర్బిందుకప్రాస సాంకర్యము. 'గిట్టియున్ + ఇఁకన్'—'వాక్యవిరామమున సంధి లేకున్నను దోషంబు లేదు' వెంకయ్యవ్యాకరణము. ఇచట వాక్య మనఁగా పద్యపాదము (అప్పకవీయము చూ.)

32 ప:—అనాదృతి=మన్నింపమి, విరక్తి=అనురాగము లేమి, వని=అరణ్యము, త్యజియించెన్=విడిచెను, మేను=శరీరము, మరణంపుటార్తి=మరణదుఃఖము (మరణదుఃఖవార్త యని యభిప్రాయము.) జీవచ్ఛవంబు=ప్రాణము గల శవము (బ్రదికియుండియు చచ్చిన ట్లుండు దేహము; నిరర్థకమైన జీవి యని భావము.)

33 ప:—సర్వమాన్యము=అందఱిచేతను గౌరవింపఁబడఁ దగినది, సర్వశూన్యము = అన్నిటిచేతను శూన్య మైనది (ఏమియు లేని దనుట), అసహ్యము=సహింపఁదగనిది, స్వయంకృతాపరాధఫలంబు =తనచేఁ జేయఁబడిన (తనకుఁ దానే చేసికొన్న-నాకు నేనే చేసికొన్న యనుట) తప్పయొక్క ఫలము, దుష్టజీవితంబు=చెడ్డబ్రదుకు (పాపపుబ్రదుకు), దుర్భరంబు=భరింపరానిది.

34 ప:—కోలుపోయి=పోఁగొట్టుకొని, చిరయత్నలబ్ధము=చిరకాలయత్నముచేఁ బొందఁబడినది, నిరసించినందునన్ = నిరాకరించుటచేత (అందుచేతన్, అందుకొఱకున్, అందునన్ ఇత్యాదు లాధునికకవిప్రయోగములు.) ఒప్పున్=తగును, సుజనస్తుతిపాత్రత=సజ్జనులయొక్క స్తోత్రమునకుఁ దగియుండుట, నితాంతచింతనన్=తీవ్ర మైన విచారమునను.

35 ప:—చండకరుండు=సూర్యుఁడు, జాలిమెయిన్-విచారముచేత, నిజరక్తదీప్తి=తనదైనయెఱ్ఱనికాంతి, దిక్ + మండలగామి=దిక్కులయొక్క ప్రదేశములకుఁ బోవునది, మృగముఖంబునన్ = మెకములనోటి (ధ్వని) చేత, కుయ్యిడుచున్ = మొఱపెట్టుచు, శుక్ + అబ్ధిమగ్నుండు = దుఃఖ మనెడి సముద్రమున మునిఁగినవాఁడు, అయఃపిండమొ = ఇనుపగుండో, శైలఖండమొ=(పర్వతసంబంధ మైన) ఱాతిముక్కయో, వివేకము= తెలివి, నిర్ణ

యింపఁగన్=నిశ్చయించుటకు. అస్తమయసమయమున సూర్యకాంతి యెఱ్ఱగా నుండుటయు, అట్లే దిక్కులవ్యాపించుటయు, మృగము లఱచుటయు, సూర్యుఁడు సముద్రమునఁ గ్రుంకినట్లుండుటయు స్వభావములు. ఇప్పుడీ బాటసారి యవి యట్లు జరుగుట తన్నుం గూర్చిన విచారముచేత నే యని తలంచెను. ఎట్లన, (దుఃఖాతిరేకమున మొగ మెఱ్ఱవాఱును) సూర్యుని మొగ మెఱ్ఱనయ్యెను; ఆతఁడు మృగముఖంబున మొఱయిడుచు (దుఃఖ) సముద్రమునఁ గ్రుంకుచుండెను. మొ.

36 ప:—వన్యసత్త్వ అర్చకులదయవలనన్=అరణ్యమృగము లనెడు పూజారుల కరుణవలన, తత్ + బలిగన్ = అతని (మృత్యుదేవత) యొక్కయుపహారముగా, ఈప్సితార్థంబు=కోరఁబడినవస్తువును (మరణము ననియు, మృతినొందిన తన చెలి ననియు), ఈ క్షణంబ=ఇప్పుడే. ఈపద్యమునఁ గల దేవత, అర్చకులు, వ్రతము, బలి వీనిని గమనించునది.

37 ప:—అనురక్తి=అనురాగము, ఎడఁబాటు=వియోగము, దుఃఖదూషితమహీస్థలిమీఁదన్=దుఃఖముచేత మలిన మైన భూప్రదేశముపైని (దుఃఖభూయిష్ఠ మైన యీ భూమిమీఁద నని భావము.) నాకము=స్వర్గము, ఐక్యము=ఏకత్వము, ఆర్తి=దుఃఖము.

38 ప:—ఆఁకొను=ఆఁకలిఁ బొందు, రవము=ధ్వని, వ్యాకులపాటుచేన్ = కలఁత నొందుటచే, వాడెన్ = వడలెను, సుభోజనాదులన్ = మంచియాహారము మొదలగువానిచేత, ప్రేఁకము=బరువు, తనువు=శరీరము, వేగ=శీఘ్రముగా, ('వేగ' ఇది కళ గాని ద్రుతప్రకృతికము గాదు. 'వేగ తెగం బాఱుడు' అని తప్రాసమున భారత. ఉద్యో. 'ప్రకటితోన్మేష కీపక్ష్మనికినకరకాతుకావాప్తి వేగ నెఘటించు' అనువసుచరిత్ర ప్రయోగమును బట్టి కొందఱు ద్రుతప్రకృతిక మని వాదించుచున్నారు గాని యర్థాంతరములకొఱకుఁ బ్రయోగింపఁబడిన యిట్టివి ప్రమాణములుగా నంగీకరింపఁ బనిపడు), మృగోత్తములు=శ్రేష్ఠము లైనమెకములారా! మిత్రభావమునను పూజ్యభావమునను పుల్లింగముగాఁ బ్రయోగింపఁబడియె. మఱియు. పూర్వ

ప్రయోగమునకు, "వివిధోత్తుంగ......అశోకోత్తమున్.....మహాభా.ఆది పర్వము), (సంబోధనము-'మధ్యమ పురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు, వినుఁడు బాలకులు మొ. బాలవ్యా. తత్స. 37 సూ.), ఆరగింపుఁడీ=తినుఁడీ, అభీప్సితార్థముల్=కోరఁబడిన వస్తువులు.

39 ప:—మానవ అభావ కాంతార ఆవాసము చేన్=మనుష్యుల లేమి గలయడవియందలియునికిచేత, మర్త్యక్రవ్యపుందీపి=నరమాంసపుఁదియ్యందనము, రోయన్=ఏవగించుటకు, కతము=కారణము, పావి=కలుచమానిసి (పాపాత్ముఁడు లేక పాపాత్మురాలు), తథ్యము=నిజము, బలాత్కారప్రాణ విసర్జనంబు = బలవంతముగా నైన యుసురుల విడుపు (ఆత్మహత్య యని భావము), కర్తవ్యము=చేయఁదగినది.

40 ప:—జలాశయము=నీ రుండు చోటు, తడయక=ఆలసింపక, మడియుట=చచ్చుట, సందిగ్ధము=సందేహింపఁబడినది (సంశయ మైనది), శ్రమము = ఆయాసము, నిక్కము = సత్య మైనది.

41 ప:—స్థిరతరంబు=మిక్కిలి నిలుకడ యైనది, తాత్కాలిక శ్రమ=తత్కాలసంబంధి యైన (అప్పటి కప్పుడు తోఁచు) ఆయాసము, ఇయ్యకొంటిన్=సమ్మతించితిని, దీర్ఘమరణయాతన=ఉన్నత మైన మరణము యొక్క తీవ్రవేదన (అధిక బాధ), తివుర నేర్తున్=యత్నింపఁ జాలుదును, ముల్లుపుచ్చఁ గొట్టుడిచికో మొనయుపగిదిన్=ముల్లు తొలఁగించుటకు మేకును గొట్టుకొనఁ బూనువిధమున; (ముల్లు తొలఁగించుటకు మేకుఁ గొట్టికొనిన చో ఆముల్లు పోదు సరియ కదా మీఁదుమిక్కిలి కొర్రిబాధ యత్యధికము గును; ముల్లు మఱింత లోనికిఁ బోయి యాతనను వృద్ధి సేయును.)

42 ప:—బహుళ ఐశ్వర్యనిధాన మై=అధిక మైన సంపదల కునికి పట్టయి, సకలసౌభాగ్యంబులన్=సమస్త మైన యోగ్యతలతో, పొల్చు=ఒప్పు, సన్మహితక్షత్రకుటుంబమందున్=శ్రేష్ఠ మైనదియు ప్రసిద్ధ మైనదియు (అగు) రాజకులమునందు, జనియింపంగన్న=పుట్టఁగాంచిన (పుట్టిన యని భావము), విషమున్=గరళ మైనను, నిస్స్పృహతన్=పోయిన కోరిక

గలుగుటచేత (కోరిక లేకపోవుటచేత), చావఁగడఁగన్=చచ్చుటకుయత్నింపఁగా, చేకూఱదు=లభింపదు, స్వస్థల......యత్నావధుల్-స్వస్థల=తమ స్థానములయొక్క, బల=శక్తినుండి, వ్యస్త=వేఱుపడినవారియొక్క (తమ నెలవుల విడిచినవారియొక్క యనుట), ప్రయత్న=పూనికలయొక్క, అవధుల్=మేరలు (పర్యవసానము లనుట). ఈ బాటసారి రాజకుటుంబమునందు జనియించి యుండఁటచే (తనకు మరణము నిమిత్తము విష మైనను దెచ్చి యిచ్చువా రొక రైన లేని హేతువున) స్థానబలముఁ దప్పినవారి బ్రదు కిట్టిదే కదా యని విచారించెను.

43 ప:—పావకుఁడు=అగ్ని (పవిత్రులుగాఁ జేయువాఁడు), సర్వ భక్షకుఁడు=(ఇది యది యనక) అన్నిటిని (అంతయును) భక్షించువాఁడు, ఉపాస్యుఁడు=కొలువఁ దగినవాఁడు, స్వీకరించున్=గ్రహించును. సర్వ భక్షకుఁడు గావున [ఈ మానిసిపావి (చూ. 39 ప.) యను] వేఱుతలంపు లేక నన్ను గ్రహించి పవిత్రతను గలిగించుఁగాక యని తాత్పర్యము.

44 ప:—పరస్పరము=అన్యోన్యము, నిర్నిద్ర అనురాగంబు=నిద్ర లేని (అధిక మైన) ప్రేమము, సంధానం బైనన్=కూడినను (ఇది 'వివాహమై' మొదలగువానివంటిదిగాఁ దలంపవలయును), ఇటన్=ఇహమందు, సత్ దాంపత్య ధర్మంబు = యోగ్య మైన దంపతుల ప్రవర్తనము, (పొందలేక), అనన్య ఆనీత ఆత్మల మై = ఇతరులచేఁ బొందింపఁబడని ఆత్మలు గలవార మై (పరులు కూర్ప నక్కఱ లేకయే తమకుఁ దామే కలియు నాత్మలు గలవార మై యని భావము; ఆత్మన్ శబ్దమున కిచ్చట జీవాత్మ మనస్సు వీనిని గ్రహింపవలయును.) దివిన్=స్వర్గమందు, అర్థింతు మేనిన్= కోరుదు మేని=కోరువార మే అయినయెడ, చిర అనూన ఆర్తిన్=చిరకాలము నుండి యున్నదియు తక్కువ కానిదియు నగు దుఃఖముచేత.

45 ప:—భాగ్యము=అదృష్టము, కృపాసౌహార్దంబులు=దయాస్నేహములు, ఎలర్పన్=అతిశయించునట్లు, సుముఖుఁడై=మనోజ్ఞ మైన మోము గలవాఁడై, సాక్షాత్కృతుండు = ప్రత్యక్షుఁడుగాఁ జేయఁబడినవాఁడు,

స్వాహావల్లభ మూర్తివో లెన్=అగ్నియొక్క యవతారమువలెనే (అగ్నికి స్వాహా స్వధా యను నిద్దఱు భార్యలు గల రని పురాణాదులు.) బాహాటంబుగన్=బహిరంగముగా, తరణోపాయంబు=తరించునట్టియుపాయము. అగ్ని దీపరూపమునఁ బ్రత్యక్ష మయ్యెఁ గావున నా ప్రయత్నమును గొనసాగించుకొనెద నని తాత్పర్యము.

46 ప:—చిత = శవమును గాల్చుటకుఁ బేర్చెడు పుల్లల ప్రోవు, చింత=దుఃఖము, జీవిన్=ప్రాణిని, దహియించి=కాల్చి, సమర్థంబు=శక్తి గలది, అపనయింపన్=పోఁగొట్టుటకు.

47 ప:--వాపోవంగన్=ఏడ్వఁగా (ఏడ్చుట), మిన్నక=ఊరక, పరబ్రహ్మాత్మకంబు=పరమాత్మయొక్క యాకారము గలది, దీపజ్యోతిన్=దీపముయొక్క తేజస్సును, సమాశ్రయించి=చేరి, సందీప్తంబుఁ గావించి=ప్రజ్వలింపఁ జేసి (మిక్కిలి మండుదానిని జేసి), సంతాపధ్వాంతమున్=దుఃఖ మనెడి చీకటిని, సంహరించి=నశింపఁజేసి, అమిత ఆనందము=మితి లేని సంతోషము, సంధిల్లన్=కూడునట్లు, పూర్వ ఆర్జితపుణ్యరాశి=పూర్వజన్మమున సంపాదింపఁబడిన పున్నెముల ప్రోవును (నెచ్చెలి నని భావము).

48 ప:—వనరుహ+అస్త్ర=పద్మములుబాణములుగాఁ గలవాఁడా (మన్మథుఁడా), దహింపన్=ఏఁచుటకు, అనంగతన్=శరీరము లేకపోవుటను (మన్మథత్వము ననియు). నేను మృతి నొందినచో బాధించుటకు నీకు నిఁక నెవ్వరు దొరకుదు రనియు, నే ననంగతను వహించిన (ఇప్పటి పగచే) నిన్ను మాత్రము బాధింపక విడుతునా యనియు, ఇప్పుడు నీ వనంగుఁడవైనను బ్రాణముతో నున్నావు గాని యప్పు డే మగుదువో చూచుకొను మనియు తాత్పర్యము.

49 ప:—దవ్వునన్ = దూరమునందు, తఱియుట=(దీనింగూర్చి) సమీపించుట, దీనత=దైన్యము.

50 ప:—దప్పి=దగ, కృశించి=చిక్కి, ఒడలు=శరీరము, ఈదృశకష్టవేళలన్=ఇట్టిదుఃఖసమయములందు, కడుకొని=పూని, జాలిఁబడి=విచా

రించి ("క. మేలుం గీడును వచ్చును,........,జాలింబడుదురు వివేక సంగతి లేమిన్. ఉత్తరహరివంశము. ద్వితీ." ఇత్యాదిప్రయోగములంబట్టి 'జాలిఁబడు' అనియుండవలయుననియేతోఁచుచున్నది. చూ. శబ్దరత్నా.)

51 ప:-పొత్తు=పొందు, అభిలషించి=కోరి, దురవస్థ=దుర్దశ, కానయందున్=అడవియందు, స్వాస్థ్యతన్=స్వర్గమం దునికిని, ప్రేముడి=అనురాగము, సన్నగిలుసె=క్షీణించు నా యేమి?

52 ప:—చారు......తటాంచలమున్—చారు=మనోహరమైన, హరిత్ తృణ=పచ్చగడ్డిచేత, ఆవృత=ఆవరింపఁబడినవియు, విశాల=విరివియైనవియు (అగు), తట=ఒడ్డులయొక్క, అంచలమున్=ఓరలు గలదియు, ప్రసన్నవాఃపూరమున్=స్వచ్ఛమైన నీటియొక్క నిండుదనము గలదియు, ఔ=అగు, తటాకమునన్=చెఱువునందు, శైవలయుక్తఫుల్లకహ్లారమురీతిన్-శైవల=నాఁచుతో, యుక్త=కూడుకొన్నదియు, ఫుల్ల=వికసించినదియు, (అగు) కహ్లారమురీతిన్=(కొంచె మెఱుపును మిక్కిలి పరిమళమును గలిగిన) కలువయొక్కవిధమువంటి విధముచేత, వల్కలములన్=నారచీరలను, ఊంపుంద్వారమునన్=పొదరింటిగుమ్మమునందు, చెలఁగెడిన్=ప్రకాశించెడును, మనోహరమూర్తి=సుందరమైన యాకృతి గలవాఁడు. తటాకమధ్యమున నాఁచుతో నొప్పు కల్హారమువలెనే పొదరింటినడుమ వల్కలములఁ దాల్చి యొక సుందరాకారుఁ డెవ్వఁడో ప్రకాశించుచున్నాఁ డని తాత్పర్యము.

53 ప:—జీవితాశ=బ్రదుకునందలి కోరిక. మనుష్యులు లేని యడవిలో కష్టదశయందు మనుజుఁ డొక్కఁడు కనంబడిన మితి లేని యానందము గలుగుట సహజము. దానంజేసి యా బాటసారి తన తలంపు మార్చుకొని జీవితాశ నొందెను.

54 ప:—దాక్షిణ్యము = స్నేహము, ఏతత్ దివ్య నవ్య ఆకృతిన్=ఈ శ్రేష్ఠమైనదియు నూత్నమైనదియు నగు రూపముతో, సంత్రాసము=అధికమైన వెఱపు, సమ్యక్ గుణరాశి = సత్యమైన (మంచి) గొనముల ప్రోవు, భాగ్యము=అదృష్టము.

55 ప:—దయామయ=కరుణతో నిండినవాఁడా, జడదారి=తపసి, మహాత్మ = గొప్పదైన మనస్సు గలవాఁడా, స్నేహప్రధానత = చనువు యొక్క ముఖ్యత్వము (ప్రేమయొక్క ప్రధానత్వ మనియు), పాంథజన మార్గదర్శి=పాటసారులయొక్క మార్గమును జూపునది (విరహులకు వారిఁ జూపునది యనియు), వెలుఁగుచున్న=ప్రకాశించుచున్న, ప్రదీపికదరిన్= దీపము చెంతను.

56 ప:—దారుణ అటవి=భయంకరమైన యడవి, ఘోరపాపఫలంబు=దారుణమైన పాపముయొక్క ఫలము, ఏరహిన్ = ఏవిధముగా, నిజవృత్తమున్=తనయొక్క (నాయొక్క యనుట) చరిత్రమును.

57 ప:—నిఖిలదైన్యము=సమస్తదీనత్వము (దైన్య మంతయు), అవ్యాజ అనుకంపామతిన్ = నెపము లేని దయతోఁ గూడిన బుద్ధితో, ఘనుఁడు=గొప్పవాఁడు, తాపసవర్యుఁడు=జడదారిమిన్న, మహత్ గాంభీర్యము=గొప్పదైన గంభీరభావము (గంభీరము=లోఁతుగలది), నందన... ధుర్యోక్తులన్—నందనమందార = దేవతావనమందలి మందారపుష్పము యొక్క, మరందబిందు = తేనెబొట్లవలె, విలసత్ =ఒప్పుచున్న, మాధుర్య= తియ్యందనము (అను బరువును), ధుర్య=మోసెడు, ఉక్తులన్=మాటలచేత (కల్పవృక్షపుఁబువ్వునందలి మకరందమువలెఁ దియ్యనైన పల్కులతో).

58 ప:—ఉసురులు=ప్రాణములు, అఱుతన్=చేరువను. మృగయుఁడు=వేఁటకాఁడు, గానము=పాట, తనకలి=చిక్కులఁబెట్టునది, కొఱవి దయ్యము=మంటరూపమునఁ గనఁబడెడి గాలి.

59 ప:—అద్భుతార్థములు=వింతను గలిగించెడి వస్తువులు, కొల్పి= కలిగించి.

60 ప:—భగ్నయత్నతన్=పూనిక చెడుటచేత, చింతనో=శోకము చేతనో, భీతి = భయము, పథిశ్రమ=దారిబడలిక, భవితవ్యనిస్పృహనో= (కాదఁగిన కార్యమునందలి లేక) అదృష్టమునందలినిరాశచేతనో, అశ్రులన్= కన్నీటియందు, తోఁగు=మునిఁగెడు, తెర్వరి (తెరువరియొక్క రూపాంత

రము)=బాటసారియొక్క, అస్యము=మొగము, క్రమ్యనన్=క్రమముగా, వ్యథా అతిశయంబున్=అధిక మైన దుఃఖమును (దుఃఖముయొక్క హెచ్చును), తపోధనుఁడు=తపస్సే ధనముగాఁ గలవాఁడు (తపసి).

61 ప:—మోసంపుటురులన్=వంచన యనెడు ఉచ్చులయందు, దైవికముగన్=భాగ్యవశముచేత, దురపిల్లెదు=చింతిల్లెదు.

62 ప:--అతిథ్యము=అతిథిపూజ, పరిగ్రహించి=ప్రీతితోఁ గైకొని, ఏతత్ మంజు నికుంజమందున్ = ఈ మనోహర మైన పొదరింటియందు, తాము=తమరు (పొంగు లనుట), చేతఃపూర్వకము=మనస్సు ముందుగాఁ గలది (నిండుమనముతోడి దనుట), స్వాగతము=కుశలప్రశ్నము (తో ఆదరించుట), సంసిద్ధంబు=చక్కఁగా ఆయత్తపఱుపఁబడినది, పాంథాళికిన్= బాటసారి సమూహములకు. (అయి యుండు నను క్రియ యధ్యాహార్యము).

63 ప:--జోగి=యోగి, వంటకమ్ములు=వండినపదార్థములు, లోపంబు=తక్కువ, వనరమాదేవి=వనలక్ష్మి.

64 ప·--పైఁడిగిండ్లన్=బంగారపుచెంబులను, వెండితుంపర=వెండిరవ (సెలయేళ్ల యందు ఱాలపైఁ బొరలుచుండు నీరు వెండితుంపరవలె నుండును.), పండి...కొండపండ్లన్, వెండి...నీరమున్, కయికొమ్మ... పైటన్, తేఁటుల...ఘటింపఁగన్ అని పద్యము ఛేదము.

65 ప:—ఆత్మవత్సర్వభూతాని = సకలప్రాణులును తనవలెనే (వంటివే), అహింస=హింస చేయమి, పరమధర్మము=మేలివిధి, శాక ఏక భక్షణంబు=కూరలను మాత్రమే తినుట, వేఁటరులు=వేఁటకాండ్రు, నాయున్కిన్=నా యుండుటచేతను (నే నుండుటచే నని యర్థము) వెఱతురు=భయపడుదురు.

66 ప:—తుల్యములు=సమానములు, సాదరబుద్ధిన్=ఆదరముతోఁ గూడిన బుద్ధిని, కృత్రిమసమర్థతావ్యాప్తిన్=చేయఁబడిన (ఐశ్వర్యాదులవలనఁ గలిగిన యనుట) సామర్థ్యము (యొక్క) కలుగుటచేత, సోదరజంతుప్రతతిన్=తోఁబుట్టినవారివంటి (దగు) ప్రాణిసమూహమును, మర్త్యాళికిన్=

మానవులకు (ఆళి=పంక్తి; సమూహ మని భావము).

67 ప:-స్థావరప్రాణిహానియున్=కదలలేని వైన (చెట్లు మొదలైన) ప్రాణులయొక్క చెఱుపుసైతము సైఁపలేక, మొదలె=మొదటనే, కంద మూలములన్=కంద మొదలైనగుంపలను వేళ్లను, పత్త్ర ఫలపుష్పములన్= ఆకులను పండ్లను పూవులను, చేతు లాడవు=హస్తములు కదలవు (మన సొప్ప దనుట).

68 ప:-చోద్యము=ఆశ్చర్యము, స్ఫురించెన్=తోఁచెను, ఈనాఁడు =నేఁడు, అభ్యాగతులు=భోజనసమయమున వచ్చిన యతిథులు, మతిమాలి =బుద్ధి చెడి (పరధ్యానముతో ననుట), ద్విగుణంబు=ఇనుమడి (రెట్టి), భగవత్సంకల్పము=దేవునియేర్పాటు, సపర్య=(అతిథి)పూజ, సంప్రీతిమైన్ =అధికస్నేహముతో.

69 ప:--ఐహికార్థంబులు=ఇహలోకసంబంధము లైన వస్తువులు, ప్రార్థ్యములు=కోరఁదగినవి, చిరానుభోగ్యములు=చిరకాల మనుభవింపఁదగి నవి,ఒండె=ఒక్కటియే, ఇహపరసుఖంబులకున్=ఇహలోకపరలోకసౌఖ్య ములకు.

70 ప:—సమీహితధర్మమున్=ఇష్టమైన ధర్మమును, క్షుధార్తి= ఆఁకలిబాధ, వైళము=శీఘ్రముగా, గాసి=ఆయాసము.

71 ప:—శారదపూర్ణచంద్రుని=శరత్కాలపు నిండుచందురునియొ క్క, ప్రశస్త సుధాకిరణంబులట్లు=మిక్కిలి శ్రేష్ఠము లైన యమృతకిరణ ములవలె, చెన్నారెడి=ఒప్పుచున్న, స్వాంతము=మనస్సు, శాంతవృత్తిన్= ఊఁబడిల్లినవ్యాపారముతో, వినయ ఏకపురస్కృతము=అడఁకువయే ముఖ్య ముగా ముందుంపఁబడినది, విధేయత=లొంగుపాటు, మునిసత్తముఁడు= మునిశ్రేష్ఠుఁడు.

72 ప:—అర్ఘ్యపాద్యపానీయభక్ష్యములు—పూజ చేయునప్పుడు పూజ్యుల హస్తములయం దిడఁబడు జలాదికమునకు అర్ఘ్య మనియు, పాద ములయం దుంపఁబడుదానికి పాద్య మనియు, త్రావఁదగినదానికి పానీయ

మనియు, భక్షింపఁదగిన పదార్థమునకు భక్ష్యమనియుఁ బేళ్లు. అమర్చు= పొందుపఱుచు, సపర్య=పూజ, తీరు=విధము, లీల=విలాసము,విలసిల్లన్= ఒప్పునట్లు.

73 ప:—కమ్రకురంగకుమారి=మనోహరమైన లేడిపిల్ల (కుమారీ శబ్దము మనుష్యేతరజంతువులయందుఁ బ్రయోగింపఁబడుట విచార్యము. అయినను ఆ యోగి యాలేడిపిల్లను బిడ్డనుంబోలె గారాబముతోఁ బెంచుకొనుచున్న కారణము నూహించి కాఁబోలుఁ గవి దీని నిట్లు ప్రయోగించెను.) జ్యోత్స్న=వెన్నెల. ఆటలు పాటలు మొ. శబ్దాలంకారము.

74 ప:—జవదాఁట లేక=మీఱఁ జాలక, పట్టన్=చేతితోఁ బట్టుకొనుటకు, ఉంకింపన్=పూనఁగా (యత్నింపఁగా), ఇంతయున్=కొంచెమైనను, కడుపుచిచ్చు=గర్భసంతాపము, ఆఁకలిచిచ్చు=ఆఁకలిమంట, శోకాగ్ని=చింత యనెడినిప్పు, ఎట్లు అడంచున్=ఏరీతిని నశింపఁజేయును (నశింపఁజేయ నేర దని యర్థము). ఈపద్యమునకు మంజరి యని పేరు. ఇది ప్రాసము లేని ద్విపద. రెం డింద్రగణంబులకుఁ బిమ్మట యతి. యతికి మాఱుగ ప్రాసయతి నిడరాదు.

75 ప:—దుఃఖవారినిధి=శోకసముద్రము, పోటు—సముద్రము పొంగునకు 'పోటు' అని యందురు. బాష్పపుందరఁగలు=కన్నీటిసులలు, సంకులంబులై=దొమ్మిగా, తద్దయున్=అధికముగా, పర్వఁగన్=వ్యాపింపఁగా,ఊర్పుగాడ్పులు=శ్వాసవాయువులు, ఉద్ధురగతిన్=దట్టమైన వేగముతో- వీవన్=విసరఁగా (వీచుధాతువు), అధోగతిన్=క్రిందికి, రోదనధ్వనుల్=ఏడ్పుటెలుంగులు, దొరకొనన్=కలుగునట్లు, తత్ మనః తరణి= ఆబాటసారి మనస్సనెడియోడ, తొట్రిలురీతి=కంపించువిధము, ఎవ్వరిన్ కరంపదు=ఎవరినిగరఁగింపదు? (అందఱను గరఁగించు నని యర్థము). గాలివానచే (సముద్రముననున్న) నావ యెట్లు కొట్టుకొనునో దుఃఖముచే నాతెరువరి హృదయ మట్లు తల్లడిల్లె నని భావము.

76 ప:—(శరీరము వేఱైనను ప్రాణ మొక్కటియె యని తెలు

పుచు) సానుభూతి (సహానుభూతి)=తోడి యనుభవము, రూపెత్తిన సరణి=ఆకారమును ధరించిన (దా యను)మార్గము 'విధ మనుట', తోఁపన్=తోఁచునట్లు, (తాను దుఃఖించునంత కృపఁ బూని) ఆతురత్వము=తొట్రుపాటు, చెలంగన్=ఒప్పఁగా, (తపస్వి యిట్లు పలికెను.) (సహానుభూతి) యనుపద మిక్కాలమున 'సానుభూతి' అని పత్రికలలోఁ జేర్పఁబడుచుండుటం జేసి యీ గ్రంథమునందును నట్లు ప్రయోగింపఁబడినట్లు తోఁచెడి.

77 ప:—అతిజీర్ణము=మిక్కిలి పాడుపడినది, పురాణ అసమవైభవము=ప్రాఁతదియు సాటి లేనిదియు నగు ఐశ్వర్యము, చతుష్పథము=శృంగాటకము (నాలుగుదారులు కలయుచోటు), భిక్షుక ఆవాసము=సన్న్యాసుల నిలయము, ప్రభాతమునన్=వేకువను, వేసరఁబోకు=దుఃఖింపకుము, స్వస్థల ఆప్తికిన్=తనదైన స్థానముయొక్క కలుగుటకు [స్వస్థల=నిజస్థానముయొక్క, (స్థానము-కర్మార్థమున షష్ఠి) ఆప్తికిన్=పొందుటకు అనియేని చెప్ప నొప్పును].

78ప:—వెఱ్ఱి=పిచ్చివాఁడు, దుఃఖహేతువు=ఏడ్పు కారణము, గోప్యము=దాఁపదగినది. దుఃఖభరము=వ్యథాతిశయము, మౌనముద్ర=మాటాడమి యను నియమము.

79 ప:—ములుకులై=బాణములై, నిజమనమ్మున్=తనహృదయమును, నాటి=గ్రుచ్చుకొని, వాక్ రక్తబిందు నికాయమున్=మాట లనెడి నెత్తురుచుక్కల సమూహమును, గద్గదస్వరముఖ ఉద్ఘాతింబున్=తొట్రుపాటుధ్వని గల నోటనుండి వెడలఁగొట్టఁబడినదానిని, హృత్తాపము=మనోవ్యథ, ప్రస్తావించెన్=చెప్పెను, నిర్విణ్ణయై=విచారము గలదై, మరంద మయబాష్పశ్రేణిన్=మకరందరూపము గల కన్నీటిచాలును, వర్షింపఁగన్=కురియఁగా; (ఇది అకరక్ష మని సీతారామాచార్యులవారి యభిప్రాయము. చూ. శబ్దరత్నాకరము.)

80 ప:—తగులము=తగులాటము (ఆసక్తి), జాగు=ఆలస్యము, సంయమి+ఇంద్ర=మునిశ్రేష్ఠ (ఇంద్రాదిశబ్దము లుత్తరపదము లైనపుడు

శ్రేష్ఠవాచకములు.), నాకమార్గము=స్వర్గముదారి (నాకమున్ + అమార్గము అనియుఁ జెప్పవచ్చును. అమార్గము=కానిత్రోవ-కానిత్రోవను బోయిన మృగములు మొదలైనవి చంపును. వానిచేఁ జంపఁబడినచోఁ దననెచ్చెలిని గలిసికొనవచ్చును.

81 ప:—చేతము=మనస్సు, కాననము=అడవి, చేడ్పడి=దుఃఖపడి, అస్రులు=కన్నీళ్లు, భూతదయావతారుఁడు=ప్రాణులయందలి కృపయొక్క పుట్టుక గలవాఁడు (భూతదయయే యీ రూపమున నవతరించినట్లున్నవాఁడనుట), కాతరవృత్తికిన్=అధైర్యమునకు (అధీరుని వ్యాపారమునకని శబ్దార్థము), కొలఁది=మితి, సంప్రీతి=అధికమైనయానందము, ఘటింపఁ బూని=కూర్ప యత్నించి, కల రితి=ఉన్న విధము (నిజమైన చరిత్రము).

82 ప:—మంజులములు=చక్కనివి, పాదకంజములు=పద్మముల వంటి పాదములు, కువలయ అధి ఈశ కోటీర రత్న ఘృణులన్=భూమండల అధిపతుల (రాజుల) కిరీటములయొక్క అంచులయందలి మణుల కాంతులచేత, రక్తిమ=ఎఱ్ఱఁదనమును, కంటక ఉపలముల చేతన్=ముండ్ల చేతను ఱాలచేతను (రక్తిమను గూర్పఁ గడఁగి తేల యని యన్వయము). ముండ్లును ఱాలును గ్రుచ్చుకొనుటచేఁ బాదములు రక్తముచే నెఱ్ఱవాఱె నని భావము.

83 ప:—ధన్యతమము=కృతార్థములైనవానిలో మిక్కిలి శ్రేష్ఠమైనది, తావక అవాప్తిన్=నీకైన పుట్టుకచేత, రాష్ట్రప్రజ=రాజ్యమునందలి జనులు, కుందుచుంగురు=దుఃఖించుచుందురు, త్వదీయ ఏతత్ వియోగంబుమైన్=నీ సంబంధమైన ఈ ఎడఁబాటుచేత, రమ్య అక్షరపాళి=మనోహరమైన అక్షరపంక్తి, రంజిల్లన్=చెలంగుటకు, తారుణ్యసంపత్ నిధీ=యౌవనమనియెడు ఐశ్వర్యమునకు నిధానమా!

84 ప:—ఎలప్రాయము=లేఁతవయసు, విరక్తి=విరాగము (ప్రేమలేమి), వహించితివి=పూనితివి, పాడియే=ధర్మమా, పితలయాగ్రహమా=తల్లిదండ్రులయొక్క కోపమా, అరివర్గదౌష్ట్యమా=శత్రుసమూహముయొక్క చెడ్డతనమా, నెవ్వగ=నిండు దుఃఖము, కతము=కారణము, మిత్రనామ

కులన్ = చెలికాండ్రు పేరివారు (కపటమిత్త్రు లనుట).

85 ప:—మైత్త్రి = మిత్త్రత్వము (స్నేహము), అనురాగము = వలపు, ఒక్కొక్క ఎడన్ = ఒక్కొక చోట, నిర్మల అనురాగంబు = స్వచ్ఛమైన ప్రేమము (కపటములేని యనురాగ మనుట).

86 ప:—అనురాగజాడ్యదోషము = కూరిమియొక్క మాంద్య మనెడి తప్పు (నిక్కమైన యనురాగము లేకపోవుట యను తప్పని భావము), వనితలకే = స్త్రీలకే (కల దనుక్రియ యధ్యాహార్యము.) అందున్ = ఆ స్త్రీ లయందును, విత్తవతులకున్ = ధనవంతురాండ్రకు, అధికము = ఎక్కువ, వలవంతలన్ = వలపువలని దుఃఖములచేత, వనరెడి = దుఃఖించుచుండు, పూరుషులు = పురుషులు (మగవారు).

87 ప:—త్రికరణశుద్ధి—మనస్సు వాక్కు దేహము ఇవి త్రికరణము లనఁబడును; (వీనియొక్క) శుద్ధి = నిర్మలత్వము, మృగతృష్ణలన్ = ఎండమావులను, విలాసవైఖరుల్ = శృంగారచేష్టాలాపములు, సాహసము = తెగువ, ప్రకటము = ప్రసిద్ధము, స్పర్ధ = పంతము, మేర = హద్దు, సకలము = సమస్తము.

88 ప:—విత్తవంతులకున్ = ధనముగలవారికి, లభ్యములు = దొరకఁదగినవి, భవనవాసము = ఇంటియందునికి, జాయసౌఖ్యము = భార్య(వలని) సుఖము, పౌరుషాకరత్వము = మగతనమున కునికిపట్టగుట, ముఖవర్ణము = మొగముయొక్క రంగు(కాంతి). [ముఖవర్ణము = మొదటి యక్షరము = ఇచ్చట (ధనము లేనన్న) ముఖవర్ణము (తొలియక్కరము) నయితము తొలంగుననుటచే 'భవనవాసము, జాయసౌఖ్యము, పౌరుషాకరత్వము' అనువాని మొదటి యక్షరము పోఁగా 'వనవాసము, (యు) అసౌఖ్యము, రుషాకరత్వము' అనునవి మిగిలి భిన్నార్థములఁ గలిగించుచుఁ జమత్కృతిని దోఁపించెడిని. రుషాకరత్వము = కోపమున కునికిపట్టగుట.) ఇట్టివి చిత్రకవిత్వములోఁ జేరును. (ఇందలి 'జాయసౌఖ్యము, (అ)యసౌఖ్యము' విచార్యము.)

89 ప:—ఇహలోకసౌఖ్యములు—ఐహికసుఖములు, హీనములు = తక్కువయైనవి, క్షణభంగురములు = క్షణకాలములో నాశనము నొందునవి,

కష్టహేతువులు=దుఃఖకారణములు, పాపమయంబులు=పాపముతో నిండినవి, సదా=ఎల్లప్పుడు, హేయధనాధిదేవతన్=విడువఁదగినదైన ధనమనెడు దేవతను, భజించెడివారికిన్=కొలిచెడివారికి, పారమార్థికశ్రీ=పరమార్థసంబంధమైన లక్ష్మి (మోక్షలక్ష్మి యని యర్థము), తలపోసి=ఆలోచించి.

90 ప:— గాఢతప్తలోహగతసుశీతలవారి=తీవ్రముగఁ గాల్పఁబడిన లోహమును బొందిన చల్లనినీరు, పొగ=(ధూమాకారమున నుండు) ఆవిరి, సెగ=వేఁడిమి, పఱపు=వ్యాపింపఁజేయు, పగిది=విధము, వాగమృతము=వాక్కనెడియమృతము, మఱుఁగు=మిక్కిలితాపము నొందు. కోపనిష్ఠురతలన్=కోపమును పరుషవాక్యములను, సమ్మరించెన్=వెడలించెను.

91 ప.—చంద్రవర్మవలెన్=చంద్రవర్మ యను పేరు గలవాని (క్షత్త్రియుని) వలె. గంభీర అర్థముల్=మిక్కిలి లోఁతైన అర్థము గల) మాటలను, భగ్నమనోరథుల్=చెడినకోరిక గలవారు (కోరికలు చెడినవారనుట), నారీలోకము=స్త్రీజనము, దూఱెదరె=నిందింతురా? (నిందింపరని యర్థము). ధీరోదాత్తులు=ధైర్యముగలవారిలో గొప్పవారు (లేక ధీరులును, గొప్పవారును) అయిన మీరు, ఔచిత్యమే=తగవా?

92 ప:—పేర్కొని=పేరెత్తి, తెగడితిన్=నిందించితిని, (చేతున్-చేయుదున్ అనుటకు గ్రామ్యరూపము. దీని నంత్యకవులలోఁ గొందఱు ప్రయోగించియున్నారు. "క. చేతోవీథిన్ సన్నుతిఁ జేతున్...... కేతున్." పిండిప్రోలి లక్ష్మణామాత్యకవి లంకావిజయము, ప్రథ. ఇత్యాది ఆధునికగ్రంథములలోని ప్రయోగములకు లెక్కయే లేదు.) చేడె-చేడియ=స్త్రీ, సుగుణి=మంచిగుణములు గలవాఁడా, సుదతి=స్త్రీ (మంచి దంతములు గలది.)

93 ప:—కలఁకంబాఱిన = కలఁగిన, ఉత్తలపడన్=తపింపఁగా, మున్నీరు=సముద్రము, విలపింపన్=దుఃఖించుటకు, తలకొన్న=పూనిన, సంవీక్షించి=చక్కఁగాఁ జూచి, ఆత్మీయము=తనది, అలఘు ఉద్రేకము=

గొప్పదైన పొంగు, అఁచికొంచున్=అణఁచికొనుచు, అతిగభీర ఆలాపముల్=మిక్కిలి లోఁతైన మాటలు, నిస్తుల తేజస్వి=సాటిలేని ప్రభావము గలవాఁడైన, తపస్వి=తాపసుఁడు, తుష్టిన్=సంతోషముతో, దృష్టులు (చూపులు) ఒప్పారఁగా నని యన్వయము. ఈపద్యమునందలి 'చిత్త, ముత్త' 'కన్నీరు, మున్నీరు' ఇత్యాది శబ్దాలంకారమును గనునది.

94 ప:—పాపము శమించుఁ గావుతన్=దోషపరిహార మగుఁగాక యని భావము, బాలచంద్ర=బాలురలో శ్రేష్ఠుఁడా, లక్ష్యము=గుఱి, ఉగ్రతపమున్=దారుణ మైన తపస్సును, దివ్యదృష్టిన్=జ్ఞానదృష్టిచేత, దిగులు=భయముతోడి విచారము.

95 ప:—పారము=అవలియొడ్డు, ధీరమునీంద్రు వాక్యములు=చలింపని మనసు కలవాఁడైన మునిశ్రేష్ఠునిమాటలు, స్త్రీజనైకసాధారణము=స్త్రీలోకమునకు ముఖ్యముగాను సామాన్యముగాను ఉండెడిది, లజ్జ=సిగ్గు, బహుధా=అనేకవిధములచేత, ప్రతిబంధకము=అడ్డగించునది.

96 ప:—సాంద్ర ...ద్యుతుల్—సాంద్ర=దట్టమైన, రాగ=అనురాగముయొక్క, వ్యాజ=నెపముతోడి, సాంధ్య అరుణద్యుతుల్=సంధ్యాకాలపుఎఱ్ఱనికాంతులు, గండభాగములపైన్=చెక్కిళ్ళప్రక్కలను, తాండవింపన్=నాట్యముచేయఁగాను, [అనురాగ ముప్పొంగఁగా (కలికి) చెక్కులెఱ్ఱవాఱుట స్వభావము; చెక్కులపై దట్టమైన యనురాగచిహ్నములు పర్వె ననియు, నవి సంధ్యాకాలకాంతులవలె నుండె ననియు భావము.] మంజుముఖి ఇందుండు=సుందరమైనమోమనెడుచందురుఁడు, మందాక్ష... చంద్రికలన్—మందాక్ష=సిగ్గనెడు, మేఘ=మబ్బుచేత, వికల=చెదరిన, దరస్మిత=చిఱునవ్వనెడి,చంద్రికలన్=వెన్నెలలను, పఱపన్=వ్యాపింపఁజేయఁగా (మబ్బు వెన్నెలంబోలె సిగ్గుచిఱునవ్వును మఱుఁగుపఱుచుచుండె నని భావము). కమనీయ పీనవక్షము=మనోజ్ఞమైనదియు పుష్టి గలదియు నగుఱొమ్ము, నిర్భర ఆనందబాష్ప ఆప్తిన్=అతిమాత్రమైన సంతోషాశ్రువులు గలుగుటచేత, పులకలువాఱి=గగుర్పొడిచి, ఉబుకన్=ఉబ్బఁగా

(వక్షస్థ్సలము ఆనందముచే నుబ్బి యెత్తుగా నున్నట్లు తోఁచుచుండె నని భావము. వక్షస్థ్సలము పులకలువాఱుట కవి యాంతరంగికదృష్టిచే నెఱుంగఁబడె నని భావింపవలసియుండును.) తనుయష్టి = శరీర మనెడు యష్టి, (యష్టిశబ్దము సన్నని పొడుగైన పదార్థములకు హారపుఁబేట, ఆయుధ విశేషము, చేతికఱ్ఱ లెక్క పు) గామ ఇత్యాదులకు--చూ. శబ్దరత్నాకరము) పేరు. "యష్టిర్ధ్వజేహారభేదే మధుకేప్యాయుధాన్తరే." నానార్థరత్నమాల ద్వ్యక్షరకాండము. కవీంద్రులు శరీరవాచకములపై 'యష్టిశబ్దము' ప్రయోగింతురు. అంగయష్టి, దేహయష్టి, గాత్రయష్టితనుయష్టి మొ. సన్ననిపొడుగైన శరీర మని యర్థము.] మించి=మీఱి, అధరపల్లవము=మోవియనెడు చిగురు, శ్వాస అనిల ఆహతిన్=ఊరుపుగాలియొక్క పెట్టుచేత, అల్లలాడన్=ఇటు నటుఁ జలింపఁగా, (తీవవంటి తనువు వడఁకుచుండఁగా దానికంటె నెక్కుడుగా నూర్పు గాడ్పుచేత చిగురువంటి మోవి యదరుచుండె నని భావము.) అట్టె=గ్రక్కున (చూ. 30ప. టీక.). ఒక్క మొగిన్=ఒక్క మొత్తముగా (ఒక్క పెట్టున నని భావము), దైన్యభయభక్తులు=దీనత్వము భయము అనురాగమును, ఉట్టిపడఁగన్=అకస్మాత్తుగాఁ గలుగఁగా (అతిశయింపఁగా ననియేని చెప్పవచ్చును.)

97 ప:—మన్నింపుఁడు=క్షమింపుఁడు అనఘస్వాంతునిన్-పాపము లేని మనస్సు గలవానిని, విచార అబ్ధిన్=చింత యను సముద్రమున, తనివి=తృప్తి, మలినీకరించితిన్=మైల చేసితిని.

98 ప:—దక్షుండవు=సమర్థుండవు, దక్షిణుఁడవు = కపటములేని మనస్సు గలవాఁడవు, (లేక) పరహృదయము ననుసరించి వర్తించువాఁడవు, సాక్షాత్ పశ్చాత్తప్తన్=కేవలము నొచ్చుకొన్నదానను (కార్యము జరిగిన తరువాతఁ జింతించుట పశ్చాత్తాప మనఁబడును), కరుణరససమృద్ధి=దయ యొక్క ఊట (ద్రవము) పెంపు (నిండు దయ యనుట), తలిర్పన్=అతిశయింపఁగా, దయనీయ=కరుణింపఁదగినది, వీక్షింపవె=చూడుమా. ముందున్న పద్యమునఁ బురుషవేషమును దొలఁగించిన ట్లుండుటచే 'దయనీయన్,

'పశ్చాత్తప్తన్' స్త్రీలింగమును దెలుపు పదములు ప్రయోగింపఁబడిరెు.

99 ప:-పరితాపము=ఆరాటము,ఎడలించి=తొలఁగించి, పొలిచెన్ = అగపడెను, మేఘనిర్ముక్తము=మబ్బుచే విడువఁబడినది (మబ్బునుండి వెలువడి పుడమికి వచ్చినది యని భావము),(ఐ), మించు=తనరారుచున్న, మించువోలెన్ = మెఱపువలె, వఱలి=ప్రకాశించి, మునివర్య=మునిశ్రేష్ఠునియొక్క, ఇష్టదేవత =ప్రియ మైన వేల్పు (అనునట్లు పొలిచె నని యన్వయము).

100 ప:—కాంతామణి=స్త్రీరత్నము, తన్మయతన్=దాని స్వరూపము గలుగుటతో [(ఒక) దాని స్వరూప మైనది తన్మయము; తన్మయభావము=తన్మయత, లేక తన్మయత్వము=దానిస్వరూపము గలది యగుట], భజించుటన్=(ఆమెను) కొలుచుచుండుటచే, నిర్విణ్ణుండు=విచారము గలవాఁడు (నిశ్చేష్టుఁ డని కవిభావము), స్వాంతంబు=మనస్సు, వధూవచోవిరతిన్-వధూ=(ఆ) స్త్రీయొక్క, వచః=మాటలయొక్క, విరతిన్=నిలుకడచే, సంబుద్ధంబు=చక్కఁగా బోధింపఁబడినది, తద్వాగమృతార్థియై—తత్=ఆపికవాణియొక్క, వాక్=వాక్కనెడు, అమృత=అమృతమును, అర్థియై=యాచించువాఁడై, ప్రోత్సాహమ్ముగాన్=మిక్కిలి యుత్సాహము అగు (కలుగు) నట్లు. [అట్లు చెప్పుచుఁ(97,98 ప. చూ.) దన మగవేసము విడిచినిల్చియున్న(99వ.చూ.) యమ్మనోహరాంగిని (తన)కన్నులు చూచుచును, చెవులు (ఆమెమాటలను) వించు నుండ నేకాగ్రచిత్తతతో నున్నయమ్ముని యామె మాట లాఁగినంతనే (వెనుకటి విషయములు జ్ఞప్తికివచ్చుటచే) చిత్తము మేలుకొనఁగాఁ దద్వాగమృతమును మఱలఁ గ్రోల నాసించి యుత్సాహము వెలువడ నిట్లు పలికె నని తాత్పర్యము.]

101 ప:—ఇందువదన=చంద్రునివంటి మోము గలదానా,సర్వ...సరణి—సర్వ=సకలమైన,సంగ=(విషయముల) కూడికల(ను) యొక్క,పరిత్యాగ=బొత్తిగా విడుచుటయొక్క, సరణి=మార్గమును, ఏడన్=ఎక్కడ, శోపతాపములు=అలుకయు కాఁకయు.

102 ప...తోఁబాటు—తోపాటు అని యుండవలయును (తో

పాటు=తోఁగూడ, ఎట్లో అట్లు అని యర్థము)' నాతిమిన్న=స్త్రీలలో శ్రేష్ఠురాలు (స్త్రీరత్నము), దిటవు=దిట్టతనము, ఈరికలు=మొలకలు, ఎనయన్=పైకొనఁగా. 'కోరిక', 'ఈరిక' 'వినయ' 'ఎనయ', శబ్దాలంకారము.

103 ప:—పావనమూర్తి=పవిత్రమైనస్వరూపముగలవాఁడా, నావలనిపాపములు=నాయెడఁ గలపాపములు, తావకదర్శనవీకఫలితముగన్=నీదగు దర్శనము (యొక్క) ఒక్కదాని ప్రయోజన మగునట్లు (నీదర్శనము ఫలముగా నాకుఁ గల పాపము లన్నియు నశించె నని భావము), మృతవిశ్రుతుఁడు=మృతుఁడైనట్లు వినఁబడినవాఁడు, మజ్జీవవిభుండు=నాప్రాణేశ్వరుఁడు, తీవ్రతపంబు=అధిక మైన తపస్సు (ఉగ్రమైన తప స్సనుట).

104 ప:—త్వత్ ఆశ్రయలాభమునన్ = నీయొక్క ప్రాపువలని ప్రయోజనముచేత, తపః శక్తిప్రయోగంబునన్ = తపస్సుయొక్క సామర్థ్యముయొక్క యుపయోగముచేత, నయనానందముగాన్ = నేత్రప్రీతి యగునట్లు, ఘటింపుము = కలిగింపుము, మనోనాథ అనుసంధానమున్ = హృదయేశ్వరునియొక్క సంఘటనను, దయితుండున్ = (నా) ప్రియుఁడు కూడ, కృతార్థత్వంబు=ధన్యత, సిద్ధించుటల్=చేకూఱుటలు. (అగును).

105 ప:—ఆలకించినకోలఁదిన్=వినినకొలఁది, మిన్నందునట్టులు=ఆకాశము నంటునట్లు, రాట్కుమారికారాగదార్ఢ్యంబు=రాచకొమరితయొక్క అనురాగముయొక్క దృఢత్వము (గట్టితనము), మునికుంజరుండు=మునిశ్రేష్ఠుండు.

106 ప:—వలపించి=మోహింపఁజేసి, వంచించి=మోసపుచ్చి, వలవంతన్=విరాళియందు (మదనబాధయందు), మహాఘోరవనవాసిన్=గొప్పదై భయంకరమైన అరణ్యమందు నివసించువానినిగా, పలు బాములన్=వివిధకష్టములయందు, పాల్పడినట్టి=పూనుకొన్న, వధువున్=స్త్రీని (పెండ్లికూఁతు ననియు), చలచిత్తము=స్థిరభావములేని మనస్సు, ఒకటన్=ఒక్కదానిచేత (ఒక్క విషయమున ననుట) పశ్చాత్తప్తమైనన్=పశ్చాత్తాపముఁ

జెందిన దైనప్పటికిని, శాశ్వతంబు=స్థిర మైనది, సరణి పద్ధతి (చలచిత్త మొక్కప్పుడు పశ్చాత్తాపము నొందినను నెల్ల ఫుడునిలుకడగల్గి యుండదని భావము.), రసాభాసకష్టదాంపత్యఘటనాఘమునకున్ =విరస మైనట్టియు కష్ట మిచ్చునదియు నగు ఆలుమగలతనమును గూర్చుటయొక్క పాపమునకు, ఒడికట్టన్ = పూనుటకు, ఓపన్ = చాలను.

107 వ:—తరుణీమణి = స్త్రీరత్నము (తరుణి =యౌవనము గలది) మాతన్ = చచ్చినదానను, లసత్ తనులత=ప్రకాశించుచున్న దేహ మనెడు తీవ, ఊఁత=పట్టు, ధారుణిన్ =భూమియందు,[‘ధారణీ’,యనుశబ్దమే కాని ‘ధారుణి’ యనునది యుండ దనియు, సంస్కృతనిఘంటువులయందే కాక ఆంధ్రనిఘంటు వగు శబ్దరత్నాకరమునఁ గూడ ‘ధారుణి’ లే దనియుఁ గొందఱు పండితులు వాదించెదరు. ఈ శబ్దముం గూర్చిన విశేషచర్చ గ్రంథ విస్తరభీతిచే నిచ్చట విరమింపఁబడి అందలి యొండు రెండు విషయములు మాత్ర ముదాహరింపఁబడుచున్నవి.

సంస్కృతాంధ్రములయందుఁ బరిపూర్ణపాండిత్యము గల పండిత వర్యులచేఁబరిష్కరింపఁబడి యచ్చొత్తింపఁబడినట్టియు, నట్టివారిచేత నే పరంపరగాఁ దాళపత్రములపై వ్రాయఁబడుచువచ్చినట్టియు నాంధ్ర గ్రంథము లన్నిటియందు (ఒకట రెంట దక్క) ధారుణి యనురూపమే కాని ‘ధారణి’ యనునది గానరాదు.

“అంబురుహవృత్తము. నారులు గోరిన ధారణి నంతయు నాఁపఁ జాలుదు రొక్కమై... ” సునందనీపరిణయనాటకము, ద్వితీయాంకము, 46 పుట. (రెండవకూర్పున నిందలి యఖండయతి సవరింపఁబడినప్పుడు ఏకారణముననో ‘ధారుణి’ యనియే ముద్రింపఁబడినది.

అల్లమరాజు సుబ్రహ్మణ్య కవిప్రణీత మగు భద్రాపరిణయ మను ప్రబంధమునకు (కణాదము పెద్దన సోమయాజిచే రచింపఁబడిన భద్రా పరిణయ మను నామాంతరము గల ముకుందవిలాసమునకుఁ బ్రతిబింబ మైన దానికి) వ్యాఖ్యానమును రచించిన బ్ర॥ పురాణపండ మల్లయ్య

శాస్త్రులవారు (కవిచే వ్రాయఁబడిన తాళపత్త్ర గ్రంథమున 'ధారుణి' యని యున్నను) తాము పరిష్కరించుటలో నన్ని చోటులను 'ధారణి' యని సవరించి ముద్రింపించినారు.

'ధారుణి' లేదని వాదించువారికి ఆంధ్రమహాభారతమునందలివాగను శాసనుని యీ క్రింది యనివార్యప్రయోగ మొక్కటియే మంచిసమాధాన మగును.

చ. "గుణముల నొప్పి బ్రాహ్మణులకుం గడు భక్తుఁడవై సమస్తధా
రుణిప్రజఁ బ్రోచుచున్ విగతరోషుఁడవై ..." ఆదిపర్వ. సప్త.129
"ధారణిప్రజఁ.....విగతరాగుఁడవై" అని సవరింపఁజూతురేమో' ఇప్పట్టున రోషమే కాని రాగము సరిపడదు.] మూర్ఛత=మొఱకుఁదనము, పొక్కుచున్=దుఃఖించుచు, విహ్వలతన్=అవశత్వమును, కొనకున్=తుదకు, ఉపచారము=పరిచర్యను, ఆతురతన్=వేగిరపాటుతో.

108 ప:—మైమఱపు=పరవశత్వము, సేద దేర్చు=శ్రమము వాపు, ఏమఱి=మఱచి, గాసిలఁజొచ్చెన్=పరితపింపఁజొచ్చెను.

109 ప:—వసంతసేన!=వసంతసేన యను పేరు గలదానా! (ఇది కథానాయిక నామము), కురంగేశ్వర పురవర అధినాథవరతనూజ!=కురంగేశ్వర మను పేరు గల పత్తనశ్రేష్ఠముయొక్క ప్రభువుయొక్క ముఖ్య పుత్త్రికా!, మనోహరా!=సుందరీ!, మదర్థమై=నానిమిత్తము, ఈ గతి=ఈ యవస్థను, కాంచినావె=పొందితివే (వా)?

'కాంచినావు', 'కాంచినాను' ఇత్యాదులాధునికకవిప్రయోగములు. 'కాంచితివి', 'కాంచితిని' ఇత్యాదులు సాధురూపములు.

110ప:—ఫణిపురీ సింహాసనాధీశతన్=ఫణి (నాగ) పురమునందలి సింగపుగద్దెయొక్క ప్రభుత్వమును, దాదిన్=ధాత్త్రిని (స్తన్య మిచ్చి పెంచిన తల్లిని), కోల్పడి=పోఁగొట్టుకొని, మహత్ క్షోభంబున్=గొప్ప కలఁతను, సైరింపఁజాలిన=ఓర్వఁజాలిన, తత్ అంతర్యమున్=దాని (మనస్సు యొక్క) అభిప్రాయమును.

111 ప:—అవినాభావ అనుబంధము=ఎప్పుడును విడిచిపెట్టియుండని సంబంధము (వినాభావము=విడిచిపెట్టుట; అది కా (లే) నిది అవినాభావము), విరహదుఃఖము=వియోగబాధ. ('నీవైన నేను గావలయు' నేనైన నీవు కావలయు', ఒండొరుల యొక్కటియె ప్రాణముగ నుండున ట్లుండవలయు నని భావము.)

112ప:—ఆశాభంగసమాత్తశోకము=కోరికయొక్క చెఱుపు(గలుగుట) వలన పొందఁబడిన వగపు, అరణ్య ఆవాస ఖేదంబు=అడవియందలి యునికివలనఁ గలిగినవిచారము, లేశంబేని=కొంచెమైనను, గణింపకున్నన్=లెక్క సేయక పోయినను, హృది=హృదయము, త్వత్ లీలా... గుణానురాగములు—త్వత్=నీయొక్క, లీలా=శృంగార చేష్టలకును, విలాస=నేర్పులకును, ఏక=ముఖ్యముగా, సంకాశ=సమానమైన, ఛన్న=కప్పఁబడిన, గుణ అనురాగములు=మంచిగుణములును ప్రేమమును (వలపును) [నీ శృంగార చేష్టలకును విలాసములకును దగిన గుణానురాగములు నీయొద్ద నున్నను అవి గూఢములై యుండుటచే నేను దెలిసికొనఁ జాలనైతి నని భావము. ('లీలా విలాస క్రియయోః-అమ.' 'లీలా కేళి ర్విలాసశ్చ శృఙ్గార ప్రభవా క్రియా-నానార్థరత్నమాల.' ఇత్యాదులంబట్టి 'లీలా' 'విలాస' శబ్దములు సమానవాచకములుగా నున్నను నిచ్చట వానికి భిన్నార్థములను గ్రహింపవలయును. 'స్త్రీణాం విలాసబిబ్బోక విభ్రమాలలితం తథా, హేలాలీలేత్యమీహావాః క్రియాః శృఙ్గార భావజాః'-అమరము.)] క్లేశమ్మున్=కష్టమును, నించెడిన్=నిండించుచున్నది. కాంచితే=చూచితివా? (ఈ పద్యమునకు 'హృది' కర్త; 'తాన్' అనునది హృదికి విశేషణము.

113 ప:—కడకంటిచూపు=ఏ (ఎవరి) కటాక్షవీక్షణము' లభియించు టె=దొరకుటయే, ధన్యత=కృతార్థత్వము, ఆకు అలములు=ఆకులుకూరలు (మొదలగునవి), భుజించుచున్=తినుచు, సహించు = ఓర్చు, ప్రాకటమైన = అతిశయమైన, అనంతరంబు = పిమ్మట, కఱవయ్యెన్ = లేనిదయ్యెను.

114 ప:—మార్మాట=మాఱుమాట=ఉత్తరము, ఆహాకారముల్ సేయుచున్=ఆహా! యను శబ్దములు చేయుచు (ఆహా! ఆహా...అనుచు), తనున్=తన్ను (ఆ స్త్రీ ననుట), లేవన్ దివియన్=లేవ నెత్తుటకు ప్రయత్న పడఁగా. ఆ+తన్వంగి=ఆ స్త్రీ, లోలాక్షులన్=చంచలమైన నేత్రముల తో (చూపులతో నని భావము), లజ్జ అవనత ఆస్యమండలము=సిగ్గుచేత వంగిన ముఖప్రదేశము, గుప్పింపన్=వ్యాపింపఁజేయఁగా, చివ్వనన్ = తటాలున, పూఁదీవలన్ తీవయై=(అచ్చటి) పూవుఁదీఁగలలో తాను నొక తీఁగయై. ఎంతగా నాలాపించినను మాఱుమాట వినరాకపోఁగా నాతఁడు దుఃఖించుచు నయ్యేలనాఁగను లేవనెత్తుటకుఁ బ్రయత్నపడునప్పటికి సిగ్గు దేఱడు క్రేఁగంటిచూపులతో మోమున సౌందర్య మొప్ప పలుక నిద్దుర నుండి లేచినట్లే మూర్ఛనుండి తెలిసి గొబ్బున లేచి పూఁదీవలమాటున కేఁగె నని తాత్పర్యము.

115 ప:-కమలపత్త్ర గత ఉదకకణములట్లు=తామరాకును బొందిన నీటిబొట్లవలె, తత్తఱించి=చలించి, ఉత్తలపడంగన్=కలఁతపడఁగా, ఉభయులు = ఇద్దఱును, ఉత్కంఠన్ = కుతూహలమును.

116 ప:—వరకరపల్లవంబులకున్=శ్రేష్ఠమైన చివుళ్లవంటి చేతుల కున్=(చేతులు పైని వేసికొనుటకు), స్పర్శ...చర్చకున్ — స్పర్శ= తాఁకు డనెడు, హిమ=మంచుచేత, ఆర్ద్ర తడిసిన (మంచు నీటితో సిద్ధము చేయఁబడిన) పటీర=గంధముయొక్క, చర్చకున్=పూఁతకును, సరససరాగసాంత్వనవచః సుధకున్—సరస=శృంగారరసముతోఁ గూడి నట్టియు, సరాగ=అనురాగముతోఁగూడినట్టియు, సాంత్వనవచః=ఊఱట మాట లనెడు, సుధకున్=అమృతమునకును, అంకసరోజశయ్యకున్=తొడ యనెడు తామరసెజ్జకును, కరము=తద్దయు, అలవడ్డవారలకున్=అలవాటు పడినవారికి, వియోగము = ఎడఁబాటు, దుస్సహంబు = ఓరువరానిది, ఇతఃపర శిశిర ఉపచారములు=దీనికంటె వేఱయిన చల్లని యుపాదిగములు, భావభవ అగ్నిన్ = మన్మథాగ్నిని (మన్మథతాపము ననుట) అణంపఁ జాలమిని వియోగము దుస్సహ మని (దుస్సహ మగు నని) యన్వయము.

117 ప:—తరతరము=క్రమక్రమముగా, అప్రయత్నమునన్ = ప్రయత్నము లేకయే, వధూవరులు=దంపతులు (ఆలుమగలు), పరస్పర విరహ అసహిష్ణుతన్=ఒండొరుల వియోగమును సహింపలేమిని, వ్యక్తము సేసెడి=స్పష్టపఱిచెడి, దీనవాక్యముల్=దైన్యమును తెలుపు (వారి)వాక్యములు, స్మరనిగమ ఉక్తమంత్రములు=మన్మథవేదమునందుఁ జెప్పఁబడిన మంత్ర (వచన) ములు (దీనవాక్యములే వివాహమంత్రము లై యని భావము), సంసృతిభావము=సంసారముయొక్క కలుగుటను (దాంపత్యము ననుట), సంఘటింపఁగాన్=కూర్పఁగా, పరిణయసంస్కృతిన్=వివాహ సంస్కారమును, బాహులు=చేతులు, మంగళసూత్రము=వివాహకాలమున వధువు మెడయందు వరుఁడు కట్టెడి పసుపుదారము, 'ఐ తగన్ పరిణయ సంస్కృతిన్ గనిరి' అని యన్వయము. అవ్వధూవరులు క్రమక్రమముగా సహించి, యన్యోన్యము విరహము నోరువఁ జాలమని వెల్లడి చేసికొనెడు జాతిపలుకులే మన్మథవేదమంత్రములై దాంపత్యమును గూర్పఁగా(వధువు కంఠమున వరుఁడు వైచిన)బాహువులే మంగళసూత్రముగా వివాహసంస్కారమును గాంచిరని తాత్పర్యము.

118 ప:—మంగళమూర్తు లిద్దఱున్=శుభాకృతులు గల యయ్యిద్దఱును, మానసిక ఐక్యమునన్=మనోవృత్తుల యేకత్వముతో (మనస్సులచే నొక్కటియే యగుటతో), పరస్పర ఆలింగన కారణంబునన్=ఒండొరుల కౌఁగిలింతలయొక్క హేతువుచేత, ఫలించిన=పండిన (లభించిన యనుట), ఏకతనుత్వమంగున్=ఒక్కటియే శరీర మగుటయందు, వ్యాసంగము గాంచి=మిక్కిలి కలియుటను గని, లేక ఆసక్తిని బొంది, లేక ఊఁతనుగొని, కంఠములు=కంఠస్వరములు, సర్వవిధములన్=అన్నిరీతులచేతను, మేళవింపురీవిం గనన్=కలయికయొక్క సంపదను గాంచునట్లు, దేవదేవున్=దేవతలకు దేవుఁడైనవానిని(పరమేశ్వరుని), వేఁడిరి=ప్రార్థించిరి, సుస్థిరసౌఖ్యకాములు ఐ=మిక్కిలి స్థిరమైన సుఖమును గోరువారై. ఆవధూవరు లిద్దఱును మనస్సులతోపాటు శరీరములు సయితము ఏకత్వము నొందు

నేమో యనుకొను) నట్లు దృఢముగాఁ గౌఁగిలించుకొని కంఠస్వరము లొక్కటిగా కలిపి నిలుకడ యైన సౌఖ్యమును గోరువారై జగదీశ్వరు నిట్లు వేఁడికొని రని తాత్పర్యము.

119 ప:—భవము=జన్మము, నిరత...సంపతులన్-నిరత=మిక్కిలి యింపు గల (పుట్టించున)దియు, నిర్మల=స్వచ్ఛమైనదియు (అగు), రాగ=అనురాగమనెడు, అంబునిధి=సముద్రమునందు, నిమగ్న=మునుంగు, దంపతులన్=ఆలుమగలను. (దేవా! ఈ పుట్టువునందే కాక ముందు జన్మముల యందు సయితము కోరిక లీరిక లెత్తించునదియు కాలుష్యరహిత మైనదియు నగు ననురాగసముద్రమునఁ గ్రోలు దంపతులుగా నుండున ట్లొనరించుచు దయఁ జూచుచుండుమా యని తాత్పర్యము.)

120 ప:—శుకపిక శారికాదుల విశుద్ధరవంబులు=చిలుకలు కోయిలలు గోరువంకలు మొదలగు పక్షులయొక్క మేలు గీతములు, మేళగించి=కలసి, సాత్త్విక భావ...బంధురుఁడై-సాత్త్వికభావ=సత్త్వగుణము గలుగుటయొక్క, మాధురీ=తియ్యఁదనముచేత, ప్రకట=వెల్లడియైన, తదీయ=ఆ పక్షుల సంబంధమైన, గీతరస=గానరసముచేత, బంధురుఁడై=ఒప్పినవాఁడై (పక్షులచల్ల నిపాటలచేగూడ నొప్పినవాఁడై), దేవదేవుఁడు=పరమేశ్వరుఁడు, ప్రకృతిముఖంబునన్=సృష్టినోటనుండి, కలసి=ఆ పక్షులతో చేరి, పాడ నారంభించిన విధము తోఁచఁగాఁ బక్షులు లోకమును మేలుకొలుపఁ జొచ్చె నని యన్వయము.

తేటగీతి. శోభనయుక్తమైన భారద్వాజగోత్ర (కుల) మును వృద్ధి నొందించుస్వభావము గలవాఁడైన కొల్లూరి గజన్న గారనియెడు మంత్రి (నియోగివర్యుని) యొక్క పుత్త్రుఁడును, పండితులకు మిక్కిలి హితుఁడై నవాఁడును నగు గోపాలరావుఁ డను కవిచే రచింపఁబడిన వసంతసేన యను పేరు గల కావ్యము ముగిసెను. (అని యర్థము.)

నడకుదుటి వీరరాజు •